# వరవిక్రయము

సంఘ దురాచారము






విక్రయదారుడు.

## గొల్లపూడి వీరాస్వామి

శ్రీ సీతారామా బుక్కుడిపో.

రాజమండ్రి.

మొదటికూర్పు 2000.

కాకినాడ.

స్కేప్ అండు కో., లో

కె. సుబ్బారాయుడు బ్రదర్సు వారిచే ముద్రింపఁబడియె.

1926.

 [వెల 1—0—0.

# ఆంకితము

ఉ. చిన్నతనంబునందునను జేరఁగఁదీసి కుమారురీతిగా
మన్ననతోడఁ బెంచి మడి మాన్యములన్ గడుఁ జక్కఁజేసి పే
రున్నతి గల్గువాఁడవగు దోయి ! యటంచు వచించినట్టి నా
యన్నయు సుబ్రమణ్యమున కంకిత మిచ్చెద వాదు గ్రంథమున్

# పీఠిక.

కవి సత్తములారా !

నేనీ వరవిక్రియ నాటకంబు నిదివఱకే రచియించితిని. కొన్ని కారణాంతరములచేత నచ్చు నొత్తించ లేకఁ బోతిని. అందువలన నాటకమింత వఱకుఁ బయటకు రాలేదు. శ్రీ గొల్లపూడి వీరాస్వామిగారి ప్రోత్సాహము చేతను నామిత్రుల ప్రోత్సాహము చేతను నేనీ నాటకము, ప్రకాశకులగు శ్రీ గొల్లపూడి వీరాస్వామిగారి కొసంగితిని. వారీ నాటకము నచ్చు నొత్తించి ప్రకాశింపఁ జేసినందుకు, నచిర కాలముననే వెల్లడిలోనికిఁ దెచ్చి నన్ను గౌరవించినందుకు నావందన శతంబు లర్పించుచున్నాఁడను.

ఇట్లు
గ్రంథకర్త
గరికిపాటి కామేశ్వరరావు,
రాజమండ్రి.



# ఇందువచ్చు పాత్రములు

పురుషులు.

శోకాల సుందర శివరావు—పెండ్లికూతురు తండ్రి

లోభిశాయ్య లింగయ్య—పెండ్లికుమారుని తండ్రి

బసవయ్యశాస్త్రి—పెండ్లికుమారుఁడు

| | | |
|---|---|---|
| అడావిడి అంకయ్య | } | పెండ్లిపెద్దలు |
| కార్యాలకామయ్య | | |

కామయ్య—వంట బ్రాహ్మణుఁడు

వెంగళిశాస్త్రి—ప్లీడరు

న్యాయాధిపతి—

శోమటి కోటయ్య—షరాబు

ఇంకా కొందఱు సందర్భానుసారంబుగ వత్తురు.

స్త్రీలు.

నీలాంబరి— 1 వ పెండ్లికూతురు

కనకాంబ—2వ పెండ్లికూతురు

గుణవతి—సుందర శివరావు భార్య.

5 20-79



శ్రీ

# వరవిక్రయము

## నాంది.

శా. బ్రహ్మాండంబు సృజింపఁ బెంప సమయింప న్నేర్చి యున్నట్టియా
బ్రహ్మోపేంద్ర మహేశ్వరాదు లిల సంపాదించుచుం భాగ్యముల్
బ్రహ్మజ్ఞాన మహీసురాన్వయము సంభావించుచున్ బ్రోచు నా
బ్రాహ్మీదేవత వర్గమున్ నటసభన్ బాలించు నశ్రాంతముం.

ఉ. కూళను దాటకిం దునిమి క్రూరమరీచసుబాహుదైత్యులం
నేలను గూలఁజేసి కడు నేర్పరివై మును గాధినందనుం
గ్రాలగ జన్నముల్ దపముఁ గాచితివంటి దయావిహీనతం
యేలక రామచంద్ర సిరి నేలుము భూరిసభప్రజావళిం.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు (ప్రవేశించి) నటీ! నీవు సత్వరంబిటులొక మారు రమ్ము.

నటి (ప్రవేశించి) నాథా! తామీ దినమున నన్నింత వేగమే రాఁబనిచిన కతం బేమియో! నేనెఱుంగ వచ్చునా?

సూత్ర—నటకులందఱు సిద్ధముగా నున్నారు. నూతన నాటక మాడవలయునని నాయభిప్రాయము.

నటి—సంఘదురాచారమును చక్కగా బోధించు వరవిక్రయమను నాటకమున్నది; దాని నాడుదమా?

సూత్ర—కవిపేరేమో! నేనడుగ వచ్చునా?

నటి—కవినామధేయమా! అది యెందుకు?

ఉ. బాలకవీశ్వరుండు వసి కె ప్రియమునందె వరించె భూరి కా
వ్యాళి రచించె నాటకము కె లందము చందము జెందు భంగిని
క్కాలమునందు సత్కవుల కె కంజపదంబుల నాశ్రయించె పే
రోలగమున్నవారు విభ కె వోజ్జ్వలుఁ జేయుతఁ దత్కవీశునిన్.

సూత్ర—(సందేహించుచు) ఓహో! కామేశ్వర రావా!

నటి—నాథా! సందియ మెందుకు? బాలుఁడనియా మీ యభి
ప్రాయము.

సూత్ర—బాలుఁడని కాదు. ఈతఁడప్పుడే కవీశ్వరుఁడై నందుకు
నాహృదయకంజ మానందించుచున్నది. సరియే! దీనినిఁ బ్రదర్శించి
సభ్యులను సంతోషాంత రంగులుగఁ జేయుదము. నీవు ముందుపోయి
పాత్రలను సిద్ధము జేయుము.

(తెర వ్రాలును)





# వరవిక్రయము

## ప్రథమాంకము

(రంగము:— పరివేశము. గృహము)

కనకాంబ - నీలాంబరి

కన— అక్కా! నాయనగారు నీతో నూలువడకుమని చెప్పి వెళ్ళినారుగదా! యీపూట నూలువడుకుట మానివేసితివేమి?

నీలాం— నేఁడెందుచేతనో నాకు చెయ్యి రాట్నముమీఁదికి పోవుటలేదే! నాయనగారు ప్రొద్దునఁబోయినపోక, యింతవఱకు భోజనము చేయలేదుకదా?

కన— అవును, నాయనగారికిప్పుడేమి పనియున్నది. మనపెండ్లికొఱకుఁ బిచ్చియెత్తినట్లు తిరుగుచున్నారు.

నీలాం— ఏమిచేయమనెదవు! ఆడుపిల్లలంగన్న తరువాత తల్లిదండ్రులకిదియే యవస్థ.

కన— అయినను - యీదినములలో కట్నములు పోయకుండిన వరుఁడు దొరకుటలేదుకదా?

నీలాం—అందుచేతనే! నాయనగారిట్టి శ్రమపడవలసివచ్చినది. రెండుమాసములనుంచి తండ్రిగారీవిధముగాఁ గష్టపడుచున్నను - సంబంధము కుదురుటకు కష్టతరముగా నున్నదికదా?

కన—అక్కా! యేమి విపరీతకాలమువచ్చినది. ప్రతివానికిఁ గట్నములయందాశ జనించినది. దినదినప్రవర్థమానము కాఁజొచ్చినది.

నీలాం—హుష్! ఊరకుండుము. అదిగో వీధితలుపుచప్పుడు - నాన్నగారు వచ్చుచున్నారు.

సుంద—(ఆరూనముతోఁ బ్రవేశించి) అమ్మాయీ! మీయమ్మ యేది.

నీలాం—లోన వంటఁ జేయుచున్నట్లున్నది-వెళ్ళి పిలుచుకురానా!

కన—అక్కా! వంటఁజేయుటలేదు. వంటయి చాలా సేపయినది.

సుంద—అట్లయిననేమి చేయుచున్నదో! లోనికిఁబోయి ఒకపర్యాయము తీసికొనిరా!

(ఇద్దఱు లోనికిఁ బోవుదురు)

గుణవతి—(ప్రవేశము) ఇదేమి! నేఁడింతసేపున్నారు. భోజనమునకు లెండు.

సుంద—పిచ్చిదానా! ఇంకెక్కడిభోజనము, ఎక్కడియూరు.

తే॥ గీ॥ కంటిలోనున్నసలకల కరణిగాదె
వెన్నుపై లేచుకురుపుల విధముగాదె
వరునిఁజూచి వివాహము జరుపుటిపుడు
కటకటా! యిట్టి దుర్దశఁ గాంచఁగలనె.

గుణ—ఇంతకుఁ బండా! కాయా!

సుంద — వెఱ్ఱిదానా! యేమి చెప్పమనియెదవు.

తే॥ గీ॥ చెడెను ధర్మంబునీతి వి । శేషముగను
పూర్వమర్యాదనశియించె । గర్వమధిక
మయ్యె కట్నమే రేపవ । లాత్మలోనఁ
బలువరించెదు పంతులు । ప్రబలినారు.

గుణ — పోని - కాలేజిలోఁ జూచితిరా!

సుంద — కాలేజీ యంతయుఁ గాళ్ళరుగఁ దిరిగినాను. చేసినపని పీసమెత్తులేదు. కాలేజీలో నున్నంత ఘోరమెందునుఁగానము.

గుణ — కాలేజీలో మన అమ్మాయికిఁ దగినవరుఁడు లేడా!

సుంద — లేకేమి! లెక్కలేనంతమందియున్నారు. వారలకుఁ గావలసినదొక్కటేకాదు-అన్నియుఁ గావలయును. పెండ్లికావలయువారు మూఁడుతరగతులుగాఁ నున్నారు. వారికి మూఁడువిధములుగాఁ గట్నమియ్య వలెనఁట! అవయిని యింకా లాంచనములు దండిగా ముట్టఁజెప్ప వలయునఁట. మొదటితరగతివానికి మూఁడు వేలు, రెండవతరగతివానికి నాలుగు వేలు, మూఁడవతరగతివాని కయిదు వేలు, అవయిని ఆస్తియేమయిన నున్నచో నంతకు రెండురెట్లుగా ముట్టజెప్పవలయునఁట. తరువాత పండుగులకు, పర్వాలకు తీసికొనివెళ్ళవలయునఁట. ప్రధానము ఫస్టుగా జరపవలయునఁట. తరువాత.

సీ॥ కాలేజికిన్ బోవఁ । గష్టమయ్యెనటంచు
సైకిలున్ గోరెడు । చపల యొకఁడు
నీటైన దుస్తులన్ । గోటైనవాచియు
షోకు గావలెనను । పంతయొకఁడు
చదువును పూర్తిగాఁ । జదివింపవలెనని
కోరు నిర్భాగ్యపుఁ । గూళయొకఁడు

శాలము కంఠువా ఽ సంక్రాంతి నాటికి
కొని పెట్టవలెనను ఽ కూళ యొకఁడు
గీ॥ అయిదు వేళ్ళకు ఉంగ్రాలు ఽ అడుగునొకఁడు
వరులు పెక్కుచందాలను ఽ వాంఛలమరి
సిగ్గు నావంత లేకవి ఽ శేమముగను
తెల్పుచున్నారు కోరికల్ ఽ దేటగాను.

గుణ—వారియొక్క నడవడిక లెట్టివి?

సుంద—ఆవిషయములో నేఁ జెప్పవలయునా! నేఁ జెప్పనక్క ఱ లేకుండనే నీకుఁ దెలియును.

సీ॥ బెంగాలి క్రాపింగు ఽ పెడ పాపిడిని దీసి
రిస్టువాచీనిధ ఽ రించు వాఁడు
మీసాలు సన్నగా ఽ మిషనుతోఁ గత్రించి
నడిబజారులలోన ఽ నడచువాఁడు
తండ్రి పంపించిన ఽ ధనముతో లేనిపో
యిన ఖర్చులన్నివ ఽ హించువాఁడు
చుట్టలు సిగరెట్లు ఽ సోడాలు కొట్లలో
కాతాల వెన్నియో ఽ కలుగువాఁడు
గీ॥ కాఫి హోటలకుఁబోయిచ ఽ క్కఁగ భుజించి
ద్రవ్యమును లేక పత్రంబు ఽ వ్రాయువాఁడు
విశ్వవిద్యాలయంబులో ఽ వేలఁగొలఁది
ఇట్టులున్నారు విద్యార్థు ఽ లెంచిచూడ.

గుణ—అట్లయినచో వారికింకను చదువెందుకు? వారి తల్లి దండ్రులీ చదువు నేలమాన్పింపరో?

సుంద—ఈదినములలో చదువులుమాన్పించుటయెట్లు? చదు

వులు ముఖ్యముగా కట్నముల కొఱకేగాని విద్యకొఱకుఁ గాదు. ఫా రుగూరునుంచి వచ్చిన పుల్లయ్యకూఁడా చదువుకొని కట్నము లాగుద మనే వుద్దేశమేకదా! అందుకనే వారాలుచేసికొని క్రిందమీఁద బడి యేదో రెండుఅక్షరములు నేర్చుకొని "పిల్లవాఁడు యోగ్యుఁడు కదా యని పిల్లనివ్వఁ బోతే కట్నమునకుకసరుచున్నారుగాదా? నీవెఱుఁగని దేమున్నది.

గుణ—ఇట్టి వెంగలికిచ్చుకంటె నే నూతనోగోతినో పిల్లను బడఁ ద్రోయుట మేలుగదా? ఇఁక మనమేమి చేయఁగలము.

సుంద—వెఱ్ఱిదానా! ప్రస్తుతము కట్నములియ్యనిదే కన్యకుఁ బెండ్లియగునా?

గుణ—అన్నట్లు సంఘసంస్కరణముకొఱకు మీతోఁ బాటు పడిన వారెందఱో యున్నారు కదా! వారి కెవ్వరికిని పెండ్లి కావలసిన పిల్లవాండ్రు లేరా? వా రిప్పుడు మీతో నేమనుచున్నారు.

సుంద—ఏమనుచున్నారా! గంగలో దిగమనుచున్నారు— నీవు చెప్పినట్లుగానే వారి దగ్గఱకు వెళ్లి సంఘదురాచారంబీ స్థితిగా నున్నదని చెప్పినాను. అంతట వారు మీసాలుదువ్వుచు సంఘదురా చారములను దూషించి, మాదగ్గఱనే వయసువచ్చిన పిల్లకాయలు న్నారని చెప్పి వారించి నన్ను యింటికిఁ బంపించినారు.

గుణ—అట్లయిన వారితో సంబంధము నిశ్చయించుకొని రాక పోయినారా!

సుంద—ఏమిలాభము—నోటికి వచ్చినట్టు పేలుటయేకాని, పట్టుదల వచ్చి నప్పుడు సున్న. ఇన్నిమాటలు మొన్ననాతోఁ జెప్పి న వినకర్రి వీరయ్యగారు అయిదువేల అయిదువందలు కట్నము పుచ్చు కొని వివాహము నిశ్చయించుకున్నారు. అదేమన; ఇంట్లోఆడువారి పోరగన్నారు. సరే దానికేమిగాని రెండు మాసములనుంచి బాల్యవివా

హము మాన్పింపవలయునని పాటుఁబడుచున్న పాపయ్యగారేమి చేసినారో విన్నావా ? పుణ్యము పాపము నెఱుఁగని నాల్గేండ్ల నాగమ్మను, నలుబదియేండ్లు నిండిన నాలుగవపెండ్లి వానికిఁ గట్టిపెట్టినారు. అంతకన్న సిగ్గేమన్నా వున్నదీ ! అది యటుండనిమ్ము కట్నములు పుచ్చుకోవద్దని గంతులువేసిన కామయ్యగారు ఇండ్లు మాన్యములు అమ్మించి పదివేల రూపాయలు కట్నముపుచ్చుకొని తమ్మునికిఁ బెండ్లి చేసినారు. వితంతు వివాహములనుగుఱించి వేదికలపై నుక్కిరిబిక్కిరయి, ఉపన్యాసము లిచ్చిన చింతపండు శీతయ్యగారేమి చేసినారో విన్నావా? చెల్లెలికి భర్త చావఁగానే వితంతువు వివాహముచేయఁగూడదని, యింట్లో నీళ్లమనిషిని మానిపించి నీళ్లబిందిచ్చి నూతికిఁబోయి నీళ్లు తెమ్మన్నారు. అంతకన్న ఘోరమున్నదా ! సంఘసంస్కర్త లీవిధముగా నున్నారు. పేలాపనతప్ప ప్రజ్ఞావిశేషములు శూన్యము. పట్టుదలసున్న, కోపముక్రోసెడు, ఆలోచన అసలేలేదు. గాంభీర్యము గంపెడు. ఇవితప్ప రెండవదేమియు లేదు. కార్యము వచ్చేసరికి క్రియ శూన్యము.

గుణ—అయినను—అందఱి నొకసారి యడిగిచూడకఁ బోయివారా?

సుంద—మొట్టమొదట నేను చెప్పలేదు. విసనకర్రి వీరయ్యగారు చేసిన వింతలు ఎవరితోఁ బ్రస్తావించినను, సరే చూద్దామనే వారేకాని సంగతి సరిగా చెప్పేవారు లేరు.

గుణ—అవును. కట్నములు కానుకలు ముట్టఁజెప్పవిదే. యీ రోజులలో వివాహముఁజేసికొనే వారెవరు. ఆడవారిమాటయే ముఖ్యమయినప్పుడు మగవారు మాత్రమేమి చేయఁగలరు.

తే. గీ. కట్నములు లేనిపెండ్లియే ? పట్నమందు
జరుగఁబో దీకముందు వి ? శ్రాంతి లేదు

గృహములన్నియుఁ గూరాకు కుప్పచేత
నిండియున్నను కిట్నాల పండుగయ్యె

తినుటకుఁ దిండిలేక పోయినను కట్నములు లాగుదమనియే యిప్పటి వారి మనోగతములు. ఆహా! దేశమెంత దురాచారభూయిష్ఠమయి పోయినది.

సుంద — అదిగో నీదే పొరపాటుమాట. ఆడువాళ్ల మాటయే యీరోజులలో ముఖ్యావసరమయినది. మగవారేమి చేయఁగలరు. ఆడుదాని మాట కెంతమాత్రము నడుగుదాఁట కూడదని కదా? ఇప్పుడు దేశాచారము.

తే. గీ. ఆడువారల ముందు నెక్కుడుగుమైన
వేయశక్యమె! మగవారు పేశ్యవిటునిఁ
జూచు చందాన భార్యగస్సుమని లేచి
ప్రాణనాథునిఁ గొట్టంగఁ బరుగులెత్త.

కేలంగినుంచి కేగివండు భోగిశాస్త్రిగారు మొన్న మనవూరు మామిడాల మజిడయ్యగా రింటికివచ్చి మజిడయ్యగారి కుమారునికి పిల్లనిచ్చెదమనిచెప్ప కట్నమడుగ రేమని కఱ్ఱఁదీసికొని మజిడయ్యగారి భార్య మల్లమ్మ భర్తమీఁదపడెనఁట. చూచినవారందఱు పకపక నవ్వినారఁట.

గుణ — అన్నన్నా — ఎంతపనిఁ జేసినది. యీకలికాలములో గయ్యాళిగండలు చాలమంది గలరు. అవును. అవును.

తే. గీ. అకట! మగవారు పందలై యాడువారి
కెదురుఁ జెప్పలేకను తమ మదమునంతఁ
జంపుకొనుచుండె నింతి విషంబుచేతఁ
జిక్కియుండిరి మగువల కుక్కలైరి.

ఇదంతయు సత్యమేకదా. ఇంక మీరన్న మాటలోఁ దప్పేమున్నది. దానికేమి గాని చివరకేమి చేసినారు.

సుంద—అందు విషయమయి నాకేమియుఁ దోఁచుటలేదు. ఊరంతయుఁ గుక్కవలెఁ దిరిగి తిరిగి యింటికి వచ్చుచుండఁగా దారిలో అడావిడి అంకయ్య యెదురుపడ, మాయింటి కొకసారి రమ్మని చెప్పి నాను. అంత అతను సరే యని వెళ్లినాఁడు.

గుణ—అడావిడి అంకయ్యయెవరు.

సుంద—ఎవరంటావా ! అడావిడి అంకయ్యాయనియు, కార్యాల కామయ్యాయనియు నీగ్రామములో నిద్దఱు బ్రాహ్మణులున్నారు. ఈచుట్టుపట్ల గ్రామాదులలో నే పెండ్లిజరిగినను వీరివలననే జరుగవలెను. వీరే సమర్థులు. కార్యమునకు నడిగట్టువా రింకెవ్వరును లేదు.

గుణ—ఆహా ! మంచిపని చేసినారు. వారికిఁ బ్రతివిషయముఁ దెలియును. వారితో నాలోచించి కార్యములు చక్కగాఁ జేయవచ్చును. వారివల్ల మనకుఁ గావలసినంత పనియగును. వెంటనే వివాహము లగు సాధనము చూడండి. మన పెద్దమ్మాయికిఁ బండ్రెండవయేడు కూడ వచ్చినది. చిన్నమ్మాయి దానికన్న నొకయేడాది మాత్రమే చిన్నది. కట్నములనివ్వలేక నింతవఱకు నాలస్యముచేయ వలసివచ్చినది. ఈమాసములో ముడిపడని యెడల తప్పక హానిసంభవించును. ఏసమయమునకు తగ్గపని నా సమయమునకుఁ జేయుచుండవలయును. నా మాట వినిపించుకోరు గదా. అయినను నేనేమి చేయఁగలను. ఈపాటికి సుఖముగా నుండెడివారము.

సుంద—ఓసీ ! పిచ్చిదానా! పిచ్చిభ్రమపడుచుంటివేమి? ఏమి సుఖము ఏమిలోకము, అత్తమామలను సాగఁదీసి నంచులకొలఁది కట్నములు క్రింద లాగుచున్నారు.

గుణ—సరే—ఎంతచేసినను మనము భరింపక తప్పదు. కట్నములపైని వెరచిన కార్యములగుట కష్టతరము.

సుంద—సరి, సరి, దీర్ఘాలోచనముతో దినములు గూడ గడ చును. పొద్దుతిరుగుచున్నది. భోజనమునకుఁ బోవుదము రమ్ము.
(అని నిష్క్రమించును.)

(నీలాంబరి—కనకాంబ ప్రవేశింతురు)

నీలాం—చెల్లెలా ! నాయనగారి మాటలను వినుచుంటివా ! ఏమయినను సరియే నేను కట్నమిచ్చిచేసెడి వరునిచే పుస్తెఁగట్టించు కొనను.

శా. తల్లిం దండ్రినిఁ గష్టపెట్టి మనతా । తల్ నాటిక్షేత్రంబులన్
 జెల్లంజేసి వరుండురాడని మదిన్ । సిగ్గున్ విసర్జించి శో
 భిల్లంగట్నము లియ్యఁబాడియె ! మహా । విద్వాంసుఁడున్ వచ్చినన్
 జిల్లింగవ్వను కట్నమివ్వకటునే । శీఘ్రంబు పెండ్లాడెదన్.

కనకా—అక్కా ! ఏమని చెప్పవచ్చును. తల్లిదండ్రుల మా టకు వ్యతిరేకించఁగలమా ! తండ్రిగారిష్టప్రకారము మనము జేయ వలయును.

నీలా—సహోదరీ ! మనబాగుకొఱకు నాయనగారు మాన్య ములనమ్మి పెండ్లిఁజేయుట బాడియా, తరువాత బీదవై యల్లాడుట తటస్థించును. మన జీవితకాలములో వారు ముష్టియెత్తుకొనుచుండ మనము చూడఁగలమా ! కావున నీకీఁకఁ జెప్ప నవసరము లేదు. అయి ననుఁ గొంత జెప్పెదను వినుము.

కనకా—ఏమది ?

నీలాం—మనము కొంచెమో ! గొప్పయో ! చదువుకొన్న వారముగదా? అందుచేతనే జ్ఞానవంతురాండ్రము అయితిమి. కాఁబట్టి ప్రపంచ పరిస్థితులనుఁ బట్టి నడువవలయును.

కనకా—అవును.

నీలాం—తల్లిదండ్రులు దైవముతో సమానులుగదా! వారలను కష్టాబ్ధిని ముంచవచ్చునా? పెండ్లికాకపోయిన కుమారుల రీతిగ నింటనుండి వారల నాదరణముచేయ వచ్చును. వారు మన నిమిత్తము బాధపడుచుండుట చూచి సహింపఁగలమా!

కనకా—సహింపలేమని కూడా నాతాత్పర్యము.

నీలాం—కాఁబట్టి మనము శుల్కముగోరు వానిని పెండ్లియాడవద్దు.

కనకా—చాల బాగున్నది. మంచి యోచనఁజెప్పితివి.

నీలాం—నాప్రతిజ్ఞవినుము.

తే. గీ. గుణముగావలె విద్యార్థి కోవిదుండు
శుల్కమేమియు నడుగం గ సుంతయైనఁ
దలఁప కుండఁ బ్రతిజ్ఞను దాల్చువానిఁ
బెండ్లియాడెద వినుమింక బేలనీవు!

నీమనోభావమేమి?

కనకా—యథార్థముగాఁ జెప్పుచుంటిని వినుము. శుల్కము కోరు వరుని బెండ్లియాడి నాన్నకి నీతిబోధించి లోకంబున దురాచారమును ఖండించెదను.

నీలా—సత్యముగ నట్లు సాగించెదవా?

కనకా—అక్కా! వేయు నీవడుగవలయునా! చెప్పిన మాటంతయో! చేసెడి కార్యముఁగూడ నంతియే!

(అంకయ్య ప్రవేశించును.)

అంకయ్య—అమ్మాయీ! సుందర శివరావుగా రింట్లో నున్నారా!

నీలాం—అయ్యా! లోనభోజనముచేయుచున్నారు. తామిటఁ గూర్చుండుఁడు.

అంక—ఇంకా ! భోజనమేనా ! నాయమ్మకడుపుకాలా! ప్రొద్దునననగా గనపడ్డారు; పండ్రెండుగంటలకు రమ్మని చెప్పినారు. ఇంకా భోజనము కాలేదు. నేనప్పుడే బజారునకువెళ్లినాను. కూరలుకొని కోటయ్యకొట్టుదగ్గఱకువెళ్లి పొడుముకొనుక్కొని స్నానముచేసి, నరయ్యగారింటికివెళ్ళి సంభావనదెచ్చుకొని యింటికివెళ్లి భోజనముచేసి చక్కావచ్చాటప్పటికి దారిలో పిల్లి యెదురుపడగాఁదిరిగిషాపుకకుఁబోయి కాసేపుకూర్చుని వచ్చినాను— అవుతే అమ్మాయీ ! మీరిద్దఱు సుందర శివరావుగారి కుమార్తెలేనా యేమిటి ?

నీలాం—అవునండి! నేను పెద్దమ్మాయిని. అదినాచెల్లెలు.

అంక—నీపేరేమి ?

నీలాం—నాపేరు నీలాంబరి. మాచెల్లెలుపేరు కనకాంబ.

అంక—బహుచక్కగానున్నాయిపేర్లు. అవుతే ! మీరేమి చదువుకుంటున్నారు.

నీలాం—నేనాంధ్రమునఁ గొంత పరిశ్రమచేసితిని. ఆంగ్లేయము కొంతవచ్చును.

అంక—మీచెల్లెలో !

నీలాం—సంస్కృతాంధ్రములలో చక్కని ప్రవీణతగలదు.

అంక—అలాగునా ! అట్లయిన తెలుఁగులో నొకపద్యమునుచదివింపుము.

కనకా—మాఅక్కయ్యకూడా అన్నిభాషలలో నారితేరినదండి. సంస్కృతాంధ్రాంగ్లేయములు చక్కగవచ్చును.మీదగ్గఱసిగ్గుచేత చెప్పలేదు.

అంక—సరి ! సరి ! యింకనే. నాకడసిగ్గు యెందుకమ్మా ? అవును. కాని నీవొకపద్యమాంధ్రములోఁ జదువుము.

కనకా—మనుచరిత్రములో బద్దెము చదివెదను,

మ। వనజాక్షోపము వామలూరుతనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవిసుబం ధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రమల్హణకవిం జోరుం మురారిం మయూ
రుని సౌమిల్లినిదండిఁ బ్రస్తుతులఁ జే ర్కొందున్ వచశ్శుద్ధికిన్.

అంక—ఆహా! మహాచక్కనిపద్యం చదివితివమ్మా! నీలాంబరీ! నీవుకూడా! యొక్కపద్యము చదివి శ్రవణానందముఁ జేయుము.

నీలాం—నేను భాగవతములోని పద్యముచదివెదను.

మ। కలఁడంభోధిఁ గలండుగాలిఁ గలఁడా కాశంబునం గుంభినిం
గలఁడగ్నిందిశలంబగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం గవ్యక్తులందంతటం
గలఁడీశుండుగలండు తండ్రి! వెదకం గానేలయీయాయెడన్

అంక—ఆహా! ఏమి శ్రావ్యము—బలేపసందుగానున్నది. నీలాంబరీ! నీకుఁ దగినవరునిఁ గూర్చెదఁ బెండ్లాడెదవా?

నీలాం—ఏహ్రి! శుల్కవిముఖుండగువరునిఁగాని నేనితరునిఁ బెండ్లియాడను.

అంక—అమ్మాయీ! యీరోజులలో శుల్కమివ్వకుండ వరుండులభింపఁడు. అయినను నాశక్తికొలఁది ప్రయత్నించెదను.

(సుందరశివరావు ప్రవేశించును.)

సుంద—అయ్యా! శాస్త్రిగారూ! మీరు వచ్చి ఎంతసేపయినది.

అంక—నేను వచ్చియిరువదినిమిషములయినది. భోజనము చేసితిరా!

సుంద—అమ్మాయీ! అమ్మకసిపెట్టుకొనియున్నది. మీరు వెళ్లి మీయమ్మనొకసారిబంపుడు,

నీలాం—కనకాంబ—మంచిది. (నిష్క్రమింతురు.)

(గుణవతి ప్రవేశించుచున్నది.)

అంక—సుందరశివరావుగారూ! కావలసిన సంబంధము చక్కగనున్నది.

సుంద—ప్రేయసీ! శాస్త్రిగారికి మనకు చాలాస్నేహము కలదు. సాధారణముగ వారెఱుఁగనివారీపురంబున లేరు.

గుణ—అలాగునా?

అంక—అమ్మా! నన్ను మీరింకా బాగుగనెఱుఁగరు. కాని పంతులుగారికి నాకుఁ జాలాపరిచయముగలదు. ఈమండలములో నెవరికి సంబంధముల విషయములు యాలోచనములు కావలసివచ్చినప్పుడు నన్నుఁ బిలిచి తద్విషయము నాలోచింతురు. పుట్టినప్పటినుండియు నే నీపురంబులోనే గాపురంబు.

సుంద—అయ్యా! శాస్త్రిగారూ! అనుకూలమయిన సంబంధములు చెప్పుడు.

అంక—పంతులుగారూ! మాటనఁగానే సరికాదు. సంబంధములలో చాలారకములుగలవు, అందు విషయమయిమీరు బాగుగనాలోచింపవలయును. నేనుఁ జెప్పేమాటలు సరిగావినుఁడు. మీకు చదువు, సాంప్రదాయము కావలయునా? సంపత్తు, చక్కఁదనము కావలయునా?

గుణ—నాకు సంపత్తు, చక్క, దనము కావలయును.

సుంద—నాకుఁ జదువు, సాంప్రదాయము కావలయును.

అంక—అబ్బా! నన్ను చంపినారే! యీనాలుగూయున్న వానిని నేను కాదు, నన్నుఁ బుట్టించిన యీశ్వరునికిఁగూడ తీసికొనివచ్చుట

తరముగాదు. ఎందుచేతనంటారా ! వారములుచేసికొని యుండేవానికి కాని చదువురాదు. సంపత్తుయున్న వానికి చక్కఁదనమేకానిచదువురాదు. యీనాలుగూయుండడము బహుకష్టతరము.

గుణ—నాకు ముఖ్యముగా చక్కఁదనము, సంపత్తు గావలయునండి.

అంక—అటులయితే ! లోభికొయ్యలింగయ్యగారి కొడుకున్నాడు. సాలునకు నాలుగువేలరూపాయలు సూన్యాలమీఁద వచ్చును. రెండువేలరూపాయలు యింటియద్దెలుమీఁదవచ్చును.

గుణ—చక్కఁదనమో !

అంక—చక్కఁదనములో చాలినవాఁడు మనయూరిలో లేడు.

గుణ—అటులయితే యీసంబంధము చూడండి.

సుంద—మరియొకటి సెలవీయుఁడు.

అంక—చదువు సాంప్రదాయముకావలెనంటే కాకరపర్తి కామయ్యగారి కుమారుఁ డంటధూబగుంట వారింటిలో వారాలుచేసికొంటూ చదువుకుంటూ యున్నాఁడు. సాలుకు మూడువందలాదాయము. బి. యే చదువుతూయున్నాఁడు. సాంప్రదాయము చక్కనిది.

గుణ—అబ్బా ! ఇది వద్దండి మొదటిసంబంధమే కుదర్చండి.

సుందర—దాని యిష్టప్రకారం చేయించండి.

అంక—కట్నములో కాస్త పట్టుగలదు హిండ్రికు,

సుందర—ఎంత ?

అంక—అయిదువేలు రూపాయలు ఆడబడుచు లాంఛనములు.

సుందర—ఈసంబంధము యోచింపుడు.

గుణ—నాయభీష్టముకూడ నంతియే.

సుందర—శాస్త్రిగారూ ! మీరు కనుక్కొని యిదిస్థిరపరుచుఁడు. మీమేలు మఱచిపోను. నాయందు దయనుంచి మంచండి.

అంక—ఆహా! ఎంతమాట సెలవిచ్చితిరి. పరాయులమా ఏమిటి. కావలసిన వారికో కాస్త యుపకారము చేయలేమా యేమిటి? ఇంతకు వారి యభిప్రాయము కనుఁగొనిన తరువాతకదా?

గుణ—ఏలాగునైనా! స్థిరపఱచుకొనండి. మాయందుచక్కగా పనిచేయవలయును.

అంక—తొందరపడిన కార్యమగునా? అయ్యా! నాకు సెలవాసంగుఁడు, మీకు రేపీసంగతంతయు చెప్తాను. కట్నములో కాస్తయిటయినా అటయినా చూస్తాను.

సుందర—దయయుంచుఁడు. మీమాట కెదురాడము. త్వరగా దయచేయుఁడు.

అంక—చిత్తము. నేనుబోయెదను.

ఇది ప్రథమాంకము (అందఱు నిష్క్రమింతురు.)





# వరవిక్రయము



## ద్వితీయాంకము

1వ రంగము:—లోభిశాయ్య లింగయ్యగారి గృహము.

లింగ—(ప్రవేశించి)

మ॥ ధనమే ప్రాణము, ద్రవ్యమే సుఖము, సౌందర్యంబుగేహంబులున్
ధనమే, సద్గతి ద్రవ్యమే యశము విద్యా మాన్యముల్ దేహమున్
ధనమే, దాతలచుట్టముఁన్ గురువుయా దారామహీపుత్రులున్
ధనముఁన్ లేనిమనుష్యజన్మము వృథా ధాత్రీతలంబందునన్.

ఆహా! ఇట్టిధనము మాన్యులు మట్టి పాలుజేయుచుండిరికదా? ధనము సమస్తములాల కారణము ధనమవశ్యకమయినది. ధనము లేనిదే తనువు చిల్లిగవ్వకు చెల్లదు. ధనమే దాంపత్య విశేషముగూర్చును. ధనమువల్లనే ధరాతలంబు క్రాలుచున్నది. ధనమువల్లనే మహా పుణ్యస్థలంబులు మంజులత వహించుచున్నవి. ధనమున్నచోటకుఁ బెక్కుమంది విచ్చేయుదురు. ధనవంతునికడకు సర్వబంధుజనము సమకూడును. స్నేహితులు చీమలవలె చేరుకొందురు. ధనములేనివానికి తలనైనఁ జూపరుకదా? ఎట్టిమహాత్ముండైనను ధరాతలంబున ద్రవ్యము కొఱకే తన తనువును ధారవోయును.

తే॥ గీ॥ ధనముకై విధాత సృజించె । దారసుతుల
ధనముకై గృహంబులఁగూర్చె । ధాత్రియందు
ధనమె ముఖ్యసాధనమని । దైవమిపుడు
తలఁచుచున్నాఁడు పహాయభూ । తలమునందు

కానిడబ్బును కారణములేనిదే పోనీయకూడదు.

గీ॥ వడ్డి వడ్డీల కుంబెంచు । దుడ్డుసతము
సౌధరాజంబులందు వా । సంబుజేయు
మంచివారలనింట గ్రి । హించుచుంౘ
నిట్టి ద్రవ్యంబు మాన్యలు । దట్టనేల

ప్రతివిషయముకంటె ధనమంటె ఎక్కువ జాగ్రత్తవహించవలయును స్వంతవ్యవహారములలో బహు జాగరూఁకతతోఁ బనిచేయవలయును. ప్రాణమయినను పోనీయవచ్చునుగాని పయిసమాత్రము పోనీయకూడదు. వాటమెఱిఁగివడ్డికియ్యవలయును. ధనమెప్రధానభూతముగా ప్రజలు చూడవలయునుగాని లేనియెడల దారిద్ర్యదేవత తల మీఁదవాసముగానుండును. వెఱ్ఱిమనుష్యులు వేయివిధంబులుగా ద్రవ్యము వ్యయము చేయుచున్నారు.

గీ॥ ఆలయంబులు కూపంబు । లందలములు
గట్టమని జెప్పుదురు కలి । కాలమందు
సత్రములు యజ్ఞములునేఁడు । సల్పునెడల
ద్రవ్యము నశింపదే చెడు । దారులందు.

ఇటువంటి భాగ్యంబును యోగ్యతలేకఁ బాడుచేయుచున్నారుగదా!

శా॥ మళ్ళున్ మాన్యములన్ గృహంబులనుయ । మ్మంజూచిపుణ్యంబుకై
గుళ్ళున్ గోపురముల్ ఫలంబులని నె । గ్గుంబాసి కట్టించఁగా
నుల్లంబందున నెంచుచుండిరిపుడున్ । యుర్వీజనుల్ వీరుశో
భిల్లం జేయుదురే ప్రపంచకములోఁ । బిండాకుదుర్ లేదుగా.

పిసినిగొట్టు ముండాకొడుకులు పిండాకుడైనను మాని ధనమును దాచవలయునుగాని వ్యయముఁ జేయుట వల్ల పడదని చాటించవలయును. లేకుండ ద్రవ్యమును బాధచేయుటే కాక నన్ను గూడా బాధచేయుదురు.

గీ॥ కుక్కనైనను గుమ్మంబు నెక్కకుండ
ముష్టిముండకు బియ్యంబు మూల్గుచున్న
వేయకుండ మార్గంబులు పృథ్విలోన
సృష్టిఁజేయక యున్నాఁడు సృష్టికర్త.

ఈరెండుబాధలు తప్పిన ద్రవ్యము నవశ్యముగా దాచవచ్చు. లోభికియున్న లోటులివియే యని పండితులు పలుకుచున్నారు. బాగుబాగు. భాగ్యము లేనిదే బ్రహ్మ అయినను పనికిరాఁడు. సంసారము సాగరముక్రింద కనఁబడుచున్నది. సానిముండలాగున చక్కనినగలు చేయించమని భార్య బాధపెట్టుచున్నదిగదా! యీయాభరణములేల బ్రహ్మసృష్టించెనో! బ్రహ్మకాదు. సాదుముండకొడుకులు బయలుదేరకరకములైన నగలు వేసికొని వచ్చి కొందఱు నట్టేటిలోఁగలుపుచున్నారు. లేనిమొకల నగల బాధలుతప్పునుగదా? పలకలగాజులఁట. యిటికలగాజులఁట, లోలకులఁట, డోలకులట, వాచీగొలుసులఁట, పరటేమిటివందలున్నాయి చేయించలేక చస్తున్నాను. కోకలు గీకలుకొనలేనుగదా! మాటాడమంటే మండిపడుతుంది (పరికించి) ఏమాధ్వని?

(వంటబ్రాహ్మణుఁడు రామయ్య ప్రవేశము)

రామ—పంతులుగారూ! వంటసామగ్రి యిప్పించరా?

లింగ—నీకనేక పర్యాయములు చిలుకకుఁ జెప్పినట్లు చెప్పినాను. ఇది కార్తీకమాసమని తెలుసునా! వనసంతర్పణ భోజనములకు వందలు కొలఁది కేకవేస్తారు. రవంతసేపూరకుండి నిష్పూరాజేస్తేనయమని నానా విధముల చెప్పినాను.

రామ—పండ్రెండు గంటలు కావచ్చినది. ఇంకా యెవరు వస్తా రండి. కడుపులో, కాలుచున్నదని అబ్బాయిగారు అడావిడిగా తిరుగు చున్నారు.

లింగ—నీ మొగములాగే యున్నది. దురద్రుముండా కొడుకు మాటలకు లెఖ చేయవద్దని అనేక పర్యాయములు చెప్పినాను.

రామ—నాకేమండి! ఇంకా నాలుగుగంటలదాకా కూర్చో మంటే కూర్చుంటాను. కాఫీహోటలులో గడుపునిండా మెక్కినాను.

లింగ—అవాసనమాత్రం అబ్బాయికి చూపకునుమీ - పాడ వగలడు.

రామ—సరే! నేను అలాగుస వెళ్ళి మళ్ళీ వస్తాను.

లింగ—నిన్నటి వంటసరుకు జమాఖర్చు చెప్పవుకావు.

రామ—అలాగయితే వినండి చెపుతాను. వంటపుల్లలు నాల్గింటికి పుల్లన్నరవున్నది. మిరపకాయలు దంపుకిపదియున్నవి. చింత పండు ఈపూటకి సరిపోతుంది. బియ్యము శేరుకి గుప్పెడున్నవి. నేయి రెండుగరిటెలున్నది.

లింగ—అంతనెయ్యి ఏమి చేశావురా!

రామ—పంతులుగారూ! మీరుమాటి మాటికి వాకేరే యంటే వూరుకొనే వాడను కాను. మీగొప్పమీది. నాగొప్పనాది. ఇల్లాగయితే నేనీయింటిలో నుండేదిలేదు.

లింగ—ఏమిరా! యింతకోపమువస్తే యేలాగురా? ఇంట్లో వున్నాక మాటలుతప్పవుకదా! అన్నట్లు అమ్మగారిని వంటవిషయమయి అడిగినావా?

రామ—అమ్మగారు. బంగాళదుంపకూర, పప్పు, దోసకాయ పచ్చడి, పులుసువండుమన్నారు.

లింగ—ఈలాగయితే కాపురం గంగలో గలపవలసిందే. అయినను నిన్ను నాయాజ్ఞ లేనిదే అమ్మగారితో మాటాడవద్దని యెన్ని పర్యాయములు చెప్పను.

రామ—పలకరిస్తేనే పాడవుతారా యేమిటండి. మీయింట్లో నున్నప్పుడు మీవారితో మాటలాడ వలయునుకదా ?

లింగ—ఇదిగో ! నామాట కభ్యంతరము పల్కవద్దు. నా యాజ్ఞ ప్రకారం మసలుతేనే నాయింట నుండుము. లేదా లేవఁగొట్టెదను.

రామ—నాకు మీతోటి అనవసరమయిన తగాయిదాలు వద్దు. పొమ్మనకుండానే పోతాను. రామారావుగారింట వంటమనిషి లేదని తహతహలాడుచున్నారు. నన్ను రమ్మని యూరికిక్రిందమీఁదఁబడి బ్రతిమాలుచున్నారు. ఇరువయిరూపాయలు జీతం యిస్తారంట. కావలశిన సదుపాయములు సాగుతాయికదా ?

లింగ—వూరికే సణుగుకొనక పద్దుప్రకారం సామగ్రి పుచ్చుకొని వంటచేయుము. ఏదో యాదాలాపంగా అన్నమాటలు. ఇంతమాత్రమునకే కోపగించవలెనా?

రామ—బాబుగారూ! అమ్మగారి దగ్గఱకు వెళ్ళి పద్దుప్రకారం సామానుపుచ్చుకుంటాను. తాళముచేతులు పంపిస్తారా ?

(అని వెళ్ళఁబోవును.)

లింగ—రామయ్యా ! యిటొకతూరి రమ్ము. అమ్మగారిని అనవసరముగా నడగఁబోకు. ఆమెకుఁ గోపము వస్తుంది. పద్దుప్రకారం నేనేసామానులిస్తాను. బియ్య మెన్ని కావలయును చెప్పుము.

రామ—పాతపద్దు ప్రకారం మానెడు.

లింగ—మిరపకాయలెన్ని?

రామ—మిరపకాయలు మూడు.

లింగ—పెసరపప్పు?

రామ—గిద్దెడు.

లింగ—వంకాయ లెన్ని కావలయును?

రామ—వంకాయలు వద్దట, బంగాళదుంపలివ్వండి.

లింగ—బంగాళాదుంపలు బజారులో లేవని చెప్పుచున్నారు. కాఁబట్టి వంకాయలు కాలేసి పచ్చడిచేయి.

రామ—సరే.

లింగ—చింతపండెంత?

రామ—చీటిప్రకారం చిన్నంయెత్తు.

లింగ—నెయ్యి, నూనె, నాల్గుతులాలు విస్తళ్లు బాదంచెట్టు ఆకులు కుట్టివేయి.

రామ—వంట చెఱుకు వద్దండి.

లింగ—దొడ్డిలోనున్న వెదురుకర్రలు మంటెట్టు. సరే నీవు త్వరగా వెళ్లి వంటచేయుము. స్నానంచేసి చక్కా వస్తాను.

రామ—త్వరితంగారండి (అని నిష్క్రమించును.)

లింగ—ఇప్పటికి యీశనివదలినది. యీముండాకొడుకుతో వేగలేకుండా యున్నాను. ఆలేమావిగున్నతో సన్నముగా మాటాడుతాడు. వద్దని మొత్తుకున్నా వినఁడు. ఇంతకు వీని ననవలసిన పనిలేదులే? ఇంతకు నాకర్మమిట్లుండఁగా యెకరిని అనవలసిన పనిలేదు. రాత్రింబవళ్లు చమటకారేటట్లుగా గష్టపడి కాని సంపాదించే పర్కి ఖర్చేకాని నిలవలేదు కదా!

(అంకయ్యగారు ప్రవేశము)

అంక—(తనలో) ఏదో! బాల్లికల్లిమాటలు మాటలాడి అటు పిమ్మట అసలు సంగతిలో దింపుతేకాని మాటాడడు. (ప్రకాశముగా)

లింగయ్యగారూ! ఏమి చేయుచున్నారు.

లింగ—అయ్యా! ఇంట్లో యీదుతూవున్నాను. "సంసారం సాగరం" అనివూరికే అన్నారాబాబూ! సంసారంతో సాగలేకనేకదా! సాలు కారువేలరూపాయిలు వచ్చుచున్నను సంవత్సరంచివరకు నంచి రూపాయలప్పుకదా! శాస్త్రిగారూ! మీారు వచ్చిన పనియేమిటి?

అంక—ఒక ఆసామిాకి తనఖా పద్దుమిాద పదిహేను వేలరూపాయలు కావలసి వచ్చినవి.

లింగ—అంకయ్యా! ఈరోజులలో వ్యవహారములు చూస్తూయున్నావా? అందఱు అప్పుకోసం బయలుదేరుతూ వున్నారు. వడ్డీలు వాటంగొలంది పుచ్చుకుంటూన్నారు. అందులో నీరోజులలో మామూలు తప్పదుకదా! రూపాయి తొమ్మిదిఅణాలు చొ॥ పద్దుపడితే తీసికొనిరా లేకపోతే శీఘ్రంగా లేవచ్చును. ఏదెట్లయిననూ వడ్డినికరంగా దీసికోబడును.

అంక—దానికేమిగాని తనఖాఅన్న తనఖాగాదు. తాతలనాటి ఒకటోరకం అయిన చెఱుకుతోటలు పంపులు. పదిహేను యకరములు భూమి. అప్పుతీర్చే టట్లుకనఁబడదు. యకరం రెండు వేల రూపాయలు చేస్తుంది. వడ్డి ఒకరూపాయి వేయించండి. నామాట విన్నరా నాకలోకంలోకి తీసికొని వెడతాను. నాణ్యంమైనపద్దు. నావల్లమిారు వచ్చినవికాని లేకపోతే యింకొకరికి పోవలసిన పద్దు.

లింగ—సరే! రికార్డు తెప్పించండి. చూచి సంగతంతా సావకాశంగా జెప్తాను.

అంక—అట్లయితే శలవు తీసికొంటాను (అని లేవఁబోయి) యీాయేడు అబ్బాయికి వివాహముఁ జేస్తారా?

లింగ—అనుకూలమయిన అత్తవారు వస్తేకాని చేయను.

అంక—అనుకూలమయిన సంబంధము. కురవాఁడు, కోటాన కోట్లుబోసిన దొంతకడు. మెట్టుకాసుప్యాసుఅయినాడఁట. సాలుకి ఆరు వేల రూపాయలు వస్తాయి. అత్తవారింట స్వర్గముఁబొందవచ్చును. అన్ని విధాలవాఁయిగా నుంటుందని మీఅబ్బాయిని గురించిన్నీ మీసాంప్రదాయము గురించిన్నీ యిదివరలో నొకరితో జెప్పినాను. ఆసంబంధము మీఅబ్బాయికి చేస్తే బాగుంటుంది. నేనీ మాటలు వారితోఁ జెప్పేసరికి యపరిమితానందముఁ బొందివారు.

లింగ—సంబంధ మెక్కడిది?

అంక—ఎఱుఁగరా ! శోక్కాలసుందర శివరావుగారు. ఆయన పెద్దకుమార్తెకుఁ బదకొండు వత్సరములు దాటినవి. చక్కనిచుక్క. సుశీలవతి. అన్ని విధాలఅబ్బాయికి అనుకూలించును.

లింగ—అంకయ్యగారూ ! చక్కదనంకొరుక్కుతింటామా యేమిటండి ! కాని సుదంర శివరావుగారికి యేపాటి వసతి ?

అంక—సాలుకు రెండువేల రూపాయలు వచ్చును, మాతామహుఁడు పదిహేనువందల రూపాయలువచ్చు మాన్యంవ్రాసి యిచ్చినాఁడు.

లింగ—దీనికేమిగాని కట్న మేపాటి?

అంక—పదిహేనువందల రూపాయలుకు లోటులేదు.

లింగ—(పెదవిచప్పరించి) ఈ కాస్త బేరమునకు నీకు గమీషను కావాలఁటావు. తీసికొని వచ్చేవి చిల్లరబేరములు.

అంక—ఎంత కట్నమిప్పించవలయును.

లింగ—అయిదువేల రూపాయ లాఖరుమాట. దీనికి వప్పుదల యితే తరువాయి సంగతి చెపుతాను,

అంక—నూటికి పదిరూపాయలు చొప్పున కమీషనువద్దువడాలి, దానివయినవారిష్టం మీ యిష్టం

లింగ—(ఆలోచిస్తూ) కట్నంసంగతది కదా ! తరువాత సంగతులివి. వెండిచెంబులు కంచం, పీతాంబరములు పింగాణీ సామాను, వాచీగొలుసు చేతిగొలుసును, రిస్టువాచీ అల్కాపాన్పుపయిన ఆకువందలు వియ్యపురాలికి వేయిరూపాయిలు లాంఛనములు అవి వివరంగా జెప్పనక్కఱలేదు. అన్నిరకాలు సామానులు విధాయకంగా వియ్యపురాలికి ముట్ట జెప్పవలయును.

అంక—ఏమయ్యా ! ఎంత వింతగా జెప్పితివయ్యా ! కాని కట్నముకోసము కాళ్లుజాపవద్దు. అయిదువేలు కాదు పదివేలిప్పిస్తాను. కాని కమీషను మఱవవద్దు.

లింగ—అంకయ్యవంతులూ! అదిగో ఇదిగో యని కాలయాపనచేయక ఏదోమాట నిక్కచ్చి నా చెవిలోఁ బడవేయవలయును. కమీషనులో గకుర్తి పడను. కావలసినంత యిప్పిస్తాను. వ్యాపారం మాత్రం చక్కగా జూడవలయును. స్వంతవ్యాపారం క్రింద జక్కబెట్టవలయును.

అంక—ఇందులో నావడిలో నంతా బడను. తినేదంతా మీరు మీ అబ్బాయిగారున్నూ.

లింగ—నీవు ముందువెళ్లి వారినిక్కడకు దీసికొని రావలయును.

అంక—సాయంత్రానికుఁ జక్కావస్తాను.

(అని నిష్క్రమించును.)

ద్వితీయాంకము.

2 వ రంగము.

(లింగయ్య-ప్రవేశము-గృహము).

లింగ—(తనలో) ముసలివానికి పడుచుభార్య ప్రాణసంకటమన్నారు. ఎంతకష్టమువచ్చినా ముసలికి వివాహము మాత్రంవద్దు.

నా లేమావిగున్న లేనిపోయిన మాటలు పెట్టికయ్యము తుగాలుదువ్వ తుంది. దీనితోఁ బోరువడలేకుండా యున్నాను.

ఉ॥ ముద్దుగ మాటలాడినను । యూలి బిగించు గరంబుతోడన
న్నొద్దను దూరమైనిలుచు । గొంతుక నెత్తిన దిట్టుచుండు నే
వద్దని చెప్పు కార్యములు । వ్యర్థముగా నొనరించుచుండు నా
పొద్దుయొకింతలే దెటుల । హా ! విధి నేనిఁక నేమి సేయుదున్.

అదిగో నాభార్య ప్రవేశించుచున్నది.

[ప్రవేశము భద్రావతి]

భద్రా—ఇంకా మీరనుటీలాగేయుంటాయి కాబోలు. తిండి తిప్పలు లేవుకద.

లింగయ్య—(తనలో) ఆహా ! నాభార్య నాకలోకములో నైనా లేదు. ఏమాసోయుగము.

తే. గీ. కొమ్మగాదిది బంగారు । బొమ్మకాని
కన్నెగాదిది లేమావి । గున్నగాని
కిల్కగాదిది చిలుకల । కొల్కిగాని
ప్రాప్తమయ్యెను నాభాగ్య । వశముచేత.

భద్రా—నామాటంటే పెడచెవిని బెడతారు కదా ? నగలు నాకెనులు చేయించరుకదా ? నామాటకు సమాధానముఁ జెప్పరే.

లింగ—ఆకలి, అంతగా లేదు. అందుచేత నాలస్యంచేశాను.

భద్రా—దాసికేమిగాని నాచీరలు మాటేమి చెప్పేరు!

లింగ—(చిఱునవ్వులు నవ్వుచు) ఇదిగో, నామాటవిను. అయిదు రకములు చీరలు అంనిమిషములో వస్తాయి.

భద్రా—నామొగం లాగేయున్నది. సంవత్సరంమట్టి పోరుతూయున్నా కాని ఒకచీరతీసికొరాలేకఁ బోతిరికదా ?

లింగ—ఇదిగో నామాటవినుము. నేను కొంటానని నీజన్మలో ననుకో వద్దు.

భద్రా—మీరు కొనకబోతే అక్టేవుంటుందా యేమిటి.

లింగ—అక్టేవుండక నీయబ్బయెవడయినా తీసికొనివచ్చి నీకి స్తూయున్నాడా యేమిటి.

భద్రా—మీరు పూరకే అబ్బాగిబ్బాయంటే మాత్రం పడేది లేదు. అవును కాని అయిదు చీరలు అన్నారేమిటి.

లింగ—రేపు అబ్బాయి వివాహకాలమందు అయిదు చీరలు అయిదురోజులు పెట్టరే !

భద్రా—(మాటవిరచి) చాలు, చాలు, సంబరాలు, సంవత్స రంనుంచి నల్పుచున్న కాని సంతోషమునకైనా ఒకచీరకొనలేదు. ఇం కామీరబ్బాయికి పెండ్లిచేయుడము నాకావెధవలు పెట్టడమునా ! ఆ! బాగానేయుంటుది. అపిల్ల మీయింట బాగానే సుఖపడుతుంది. దిక్కులేని వారెవరో మీకివ్వాలికాని దిక్కున్నవారు మాత్రం మన అబ్బాయికి పిల్లను మాత్రం యివ్వరు. నేను శుభ్రమైన కోకగట్టుకొని యెఱుఁగనుకదా ! ధనమున్నందుకుఁ దనువు సౌఖ్యమందవలయును. తగలపెట్టిన తరువాత డబ్బువెంటరాదు కదా!

చ॥ బ్రతికిన నాల్గునాళ్లు సుఖ । పర్వమునందు చరించి బిడ్డలన్
అతివినయంబుఁగా బెనిచి । అందఱియెందు దయాంతరంగుఁడై
సతిని సుఖంబులందు నర । సంబుగజూచి మెలంగుమాన్యుడే
క్షితిని మహామహుండనుచుఁ । జెప్పెద రిప్పుడు ప్రాణనాయకా.

లింగ—బాగానేయున్నది. అథంశుభం లేకుండా వాగుతావు కదా ! శుభసూచకాలు మాటలాడుతుంటే శోకాలపెట్టుతావుకదా?

భద్రా—మీరిల్లామాటాడితే నేనీబాధబడలేను. నాపుట్టింటికి నేను పోతాను.

లింగ—వెఱ్ఱిమొగమా! యీమాత్రమునకే యింతవంత పడాలటే. నామాటవినుము. నాణ్యమైనచీరలుకొంటాను. పెండ్లివారీ సాయంత్రం చక్కా వస్తారట. సంబంధము స్థిరపరుస్తాను. నీకు కావలసినలాంఛనములు జాగ్రత్తగా ఫయిసలుచేస్తాను. నూటికిబదిరూపాయలు తక్కువకానీయను. ఇందులో నాకీయనక్కఱలేదు.నీయిష్టానుసారము చేసికొనవచ్చును.

భద్ర—ఆ! మాటమాత్రం అతిసులభంగా వస్తుంది. ధనము మాత్రం దమ్మిడివ్వరుకదా.

లింగ—ఓసీ! పిచ్చిదానా! పోటుకుండలాగున వాగకపామాటరవంత వినుము.

తే॥ గీ॥ ధనము ముఖ్యంబు గౌరవ దాయకంబు
ధనమె పుణ్యంబు దేవుండు అనవరతము
ధనములేనివాని బ్రతుకు ధాత్రియందు
చులకనాగాదె పరులకుఁ దలఁచిచూడ.

భద్ర॥ ఆ! మీదగ్గఱ ధనముండు కొంతోయ గౌరవముగా గనబడుచున్నది. మీవద్దధనము నపుంసకునికి రంభయు నొకటి. దానధర్మములు లేకఁబోయినా కాధనము తగులబెట్టనా? సరి, సరి, సాయంత్రమగుచున్నది. నేనులోనకుఁ బోయి వంట చేసికోవలయును. మాటలతోఁగాలక్షేపముఁ జేయుటమంచిపని కాదు.

(అని నిష్క్రమించును.)

లింగ—ఆసీ! దీనితల్లిముండా మొయ్య! ఎంత బెడసరికొట్టుగా మాట్లాడినదీ! ముసలి మొగుడంటే యీకాలములో మొత్తబుద్ధి!

కాని ముసలివానికి పడుచుపెండ్లాము జన్మజన్మాలకు వద్దు. ఈపెండ్లి నే నెందుకు జేసికొంటినా! యనిశంకించుచుంటిని.

తే॥ గీ॥ గాలినొక మూటలోఁ బెట్టి గట్టవచ్చు
అగ్ని నఱచేతిలో బెట్టి యాడవచ్చు
గాని పడుచుపెండ్లాము ని కాలమందు
లొంగఁదీయఁగా లేదు యీ లోభియెపుడు.

(తెరవ్రాలును)



# వరవిక్రయము

## తృతీయాంకము



మొదటిరంగము — రాజవీధి.

ప్రవేశము — కామయ్య, అంకయ్య.

అంక — ఏమిరా! కామయ్యా! కార్యాలవిషయమయి కాస్తయినఁ దలఁపవుకదా? ఈమాఘంలో ముహూర్తములు దాటాయంటే చొప్ప గడ్డి తినవలశినదే వచ్చేది మూఢంగదా?

కామ — శాస్త్రీ! కాళ్ళు చిల్లులుపడేలాగున తిరిగినాను. క బుర్లుపంపడమేకాని, కానిడబ్బు యిచ్చేవాఁడులేడు.

అంక — ఓరిగంటివారింటిలో జరిగిన వివాహమునకు నీవుంటివా! ఆడబ్బు యెవ్వరిదగ్గఱవున్నది.

కామ — అదే! నీవద్దవున్న పాడుబుద్ధి, డబ్బేడబ్బే యని యేడుస్తావు. కాని చమటూర్చి సంపాదించుదామన్న మాటలేదు.

అంక — సరి, సరి, చల్లగా సంగతిచెప్పేసరికి దెబ్బలాటకు సిద్ధము. అన్నట్లు చెప్పుటమఱచితిని. శోకాల సుందరశివరావుగారి పె ద్దమ్మాయికి లోభికొయ్య లింగయ్యగారి అబ్బాయి నిచ్చుటకు తాం బూలము లీరోజున పుచ్చుకుంటారఁట. అందులో వ్యవహార మంతా

మనమే నడవవలయును. సుందరశివరావుగారి పక్షం నేను. లింగయ్య గారి పక్షంనీవు.

కామ—ఆగొడవ వేమిటో కాస్త చెవినేద్దు

అంక—నీవు, ఇంకొక సంబంధము తీసికొని వచ్చినట్లుగా వారందరిమధ్యను మాట్లాడవలయును. నేనీలోపుగా నీయననుటో పీలోకి తోస్తాను. వ్యాపారంయావత్తు లాలాచీగా నడవవలయును. మనవాటాలు తరువాత సర్దుకొనవచ్చును.

కామ—అవును - యీసంగతి నిన్న సాయంతనములింగయ్యగారింటికి నేను వెళ్లినప్పుడు యాదాలోకంగా చెప్పినారు.

అంక—సరే! నేను ముందుగానింటికి పోయిభోజనము చేసి వారింటికి వస్తాను. నివుకూడా త్వరగా లింగయ్యగారింటికి దయచేయి. ఇదిగో నీతో నీమాట రహస్యంగా లింగయ్యగారు చెప్పమన్నారు. (అని కామయ్య చెవిలో జెప్పును)

కామ—ఓరి! ఈమాత్రమునకే జంకుతాననుకొంటివా యేమిటి! అరనిమిషంలో అంతా రైటుచేస్తాను. సరే! "ఆలస్యం అమృతం విషం" అన్నాడు. త్వరగాబోయి తలలుమారుద్దాముపద.

(అని నిష్క్రమించును)

తెరలేచును—ప్రదేశము - లింగయ్యగారి
గృహము—ప్రవేశము - లింగయ్య - అంకయ్య
కామయ్య - సుందరశివరావు

2 వ రంగము

కామ—అయ్యా! లింగయ్యగారూ! నామనవి కాస్తచిత్తగించవలయును. కట్నంలో బట్టుబడితే లాభంలేదు. పిల్లచాలా యందమయినది.

లింగ—చాల్లేవయ్యా! కులుపు సలిపినట్లు సల్పుతున్నావు. చక్కదనం మాకెందుకయ్యా! కొరుక్కొని తింటామా యేమిటి? ఇష్టమయినట్లయితే నాసలహాప్రకారము చేయండి. ఆరువేలరూపాయలనొక లెక్కయా? వెంటపాటి పాపయ్యశాస్త్రులుగారు పదివేలరూపాయలిస్తానన్నారు. అందుకింకా యింటిదాని కనుమానంగానున్నది.

అంక—(సుందరశివరావుతో) మనకు దరిద్రకొట్టుముండాకొడుకు దాపురించినాడు. ఏలినాటిశనిమనకెన్నడుకు వదలదన్నట్లు వీడు వదిలేటట్లు కనఁబడుటలేదు. వీడేదిత్వా సంబంధము తీసికొని వచ్చినట్లున్నాడు.

సుంద—నేను నీతో నింతకు ముందే గట్టిగాఁ జెప్పినాను. కాలమతిక్రమించుతే కార్యం లేదనికూడ చెప్పినావిన్నావు కాదు కదా !

అంక—ఇప్పుడుమాత్రమేమి మునిగిపోయినది. నేను నిన్న సాయంత్రమే లింగయ్యగారితోఁ గట్టిగా మాట్లాడివచ్చినాను. అయితే బజానామాత్రం యివ్వలేదు. (లింగయ్యతో) బాబూ! లింగయ్యగారూ! నిన్నమాకు మాటిచ్చితిరిగదా ! యీవేళ యీపయిబేరము లేమిటి?

లింగ—అవును! నేనుజెప్పినమాట వాస్తవమే సంబంధముల తోటి సాగలేకుండాయున్నాను. వీరు రెండుమాసముల క్రిందటనే చెప్పినారు. కాని కాలదోషం బట్టినది. నిన్నటిప్రకారం ఘయిసలు చేయించినారా యేమిటి?

కామ—అయ్యా! నన్నువిడచిపెట్టి ఇంకొక గొడవలో దిగుట భావ్యముకాదు. ఎనిమిదివేల రూపాయలకు స్థిరపరచండి.

లింగ—లాంఛనములో?

కామ—అన్నియు నందులోనివే!

అంక—(సుందరశివరావుగారితో) చూచితిరా వీని మొండితనము. కాని వీని పని వట్టిదను. సంబంధము మాత్రము పోనీయంగూడదు. (లింగయ్యతో) బాబూ! వయిస్తు మావయిదువందలు. ౼

కామ—ఆ అయిదువందలు మేమేకట్టుకొంటాము.

సుంద—(అంకయ్యతో) పెండ్లికుమారుని ఒకసారి సావిడిలోనికి తీసికొనిరమ్మనండి.

అంక—లింగయ్యగారూ! అబ్బాయి యేమి చేస్తూయున్నాడు. ఒకతూరి పిలిపించండి.

లింగ—(లోనకు ముఖముద్రిప్పి) అబ్బాయీ! బసవయ్యశాస్త్రి! సావిడిలోనికొకసారిరమ్మా (అనిపిలుచును)

(బసవయ్య శాస్త్రి ప్రవేశించును)

బస—నాన్నగారూ! నన్నెందుకుబిలుస్తా.

లింగ—నిన్ను మీమామగారు చూచుటకు బిలిపించివారు. యీలాకూర్చుండుము.

బస—(కూర్చుండును)

కామ—లింగయ్యగారూ! ఏదో! ఒకమాట మీద బేరం ఫయిసలుచేయించండి?

లింగ—నామాట వింటారా బాబూ!

అంక—ఆలాగున అనకండి, తొమ్మిదివేల రూపాయలు మా సుందర శివరావుగారు కట్టుకుంటారు, అటుపిమ్మట మీయిష్టము.

కామ—లింగయ్యగారూ! ఆరూపాయలు చూ ఆసామీయే యిస్తాడు లెండి. మూకుండిరము చేయించండి.

అంక—కామయ్యా! నీవీలాగునకార్యానకు అడ్డము తగలడము శ్రేయము కాదు.

కామ — నాకిష్టమే! కాని మాయజమాని పుత్రుర్వ పరికార ము సదుస్తాను.

అంక — సరే! నీమొండితనమేమిటో చూస్తాను. రా మెంతవ రకు రాఁగలవో? పూతరపు పాట తొమ్మిదివేల అయిదు వందల రూపాయలు.

లింగ — సరే! బాగానే యున్నది. కామయ్యా! వీరికిరింద స్థిర పఱచుచున్నాను.

కామ — అలాగున చెప్పకండి. మాయజమాని ఆర్డరు అంతవ రకే. తరువాత కనుక్కొని వచ్చేదాకా ఆగండి.

అంక — ఇంక మేముండము. యీలాగునయితే మాయజమాని కిష్టమే లేదు.

కామ — ఏమయితేఅయింది. నేనే ఆసామ్ము యిచ్చేదను. తరు వాత వారితో మాట్లాడుతాను.

అంక — (సుందర శివరావుగారితో) అయ్యా! మనవి చేస్తాను. యీలా గొక సారి రండి (అని లేచి) ఈముండా కొడుకు వదిలేటట్టు లేదు. సంబంధము చక్కనిది. తరుణం దాటితే సందర్భము కాదు. నామాట విని పదివేల రూపాయలుకు ఖాయపరుస్తాను.

సుంద — సరే కానియ్యండి (ఇరువురు కూర్చుందురు)

లింగ — నీమాటేమిటో ఖరాగా చెప్పు. చీకటి పడవచ్చినది. నేనుండేది లేదు. దూడ దుడుకు గావలశినంత వ్యవహారము.

బసవ — (తనలో ముందుకువచ్చి) ఆహా! ఏమిటీ వింత! నేన న్నఁడు విని యెఱుఁగ కని యెఱుఁగ.

తే. గీ. నడిబజారులో బట్టలం ్మె కాడుకరణి
సంతలో బసవుల నమ్ము ్మె చందమునను

వేలమును వేయుచున్నారు ॥ పెండ్లికొడుకు
నివ్వా డక్కట నేనేమి ॥ చెప్పఁగలను.

(వ్రిశాళముగా) నాన్నగారూ! నాకు బడి వేళతిక్రమించుచున్నది. నేఁ బోవలయును.

అంక—అబ్బాయీ! రాత్రిపూట బడి యేమిటి?

బసవ—పరీక్షలు దగ్గఱగా నున్నవని, పాఠములు కాక నైటుస్కూలు పెట్టినారు.

అంక—ఒక్కక్షణము కూర్చుని తరువాత వెళ్ళవచ్చును.

లింగ—అవునురా! ఈగొడవ ఫయిసలు కానిమ్ము. తరువాత పోదుకాని.

అంక—బాబూ! యింక అనవసరమయిన గొడవలెందుకు. నామాట వినండి. పదివేలు రూపాయలు కట్నము మాసుందర శివరావుగా రిచ్చెదరు, స్థిర పఱచండి.

కామ—ఇఁక మాకిష్టము లేదు. మీయిష్టానుసారముగాఁ జేసికొనుఁడు.

అంక—సుందర శివరావుగారూ! కొంత సొమ్ము అడ్వాన్సుగా నిచ్చి కాస్త రశీదుముక్క పుచ్చుకొండి. ఆలస్యం అనవసరముగాఁ జేయకండి.

సుంద—ఇదిగో నూరు రూపాయల నోటు.

అంక—బాబూ లింగయ్యగారూ! సొమ్ము పుచ్చుకొని కాస్త రశీదు ముక్క మావారి కిప్పించండి.

లింగ—(నోటు పుచ్చుకొని) అంకయ్యా! నీవు వ్రాసియిస్తే నేను వ్రాలు చేసి యిస్తాను. త్వరగా కానిమ్ము.

అంక—(కాగితం కలంపుచ్చుకొని వ్రాయుచుందును)

లింగ—బావగారూ! లాంఛనములలో లావాదీవీలు లేకుండా సరిపుచ్చాలి. రివాజు ప్రకారం అన్నియు జరుగవలయును. మళ్లీ, మళ్లీ, మనలో మనకు పేచీలు వనికిరావు. సొమ్మంతా వివాహామునకు ముందుగా బదిరోజులలో బంపించ వలయును.

సుంద—మీయిష్టానుసారముగా సాగిస్తాను. బంధుత్వములో తేడాలెందుకుంటా యండీ!

అంక—లింగయ్యగారూ! వ్రాసితిని సంతకంచేయండి (అని కాగితమిచ్చును. లింగయ్య వ్రాలుచేసి తిరిగి కాగితము సుందర శివ రావుగారికి యిచ్చును.) బాబూ! సుందర శివరావుగారూ! వయి కొక సారి చదివి వినిపించండి.

సుందర—(కాగితము విప్పి) "సుహాంరాజ. శ్రీ శోకాల సుందర శివరావు బావగారికి వియ్యంకుడు లోభికొయ్య లింగయ్యవ్రాసి యిచ్చిన వుత్తరము. ఈరోజునమా అబ్బాయిని మీ పెద్దమ్మాయి నీలాంబరికిచ్చి పెండ్లి చేసికొనుటకు నిశ్చయించుకొని తాంబూలములు పుచ్చుకొన్నాము. సదరు పెండ్లికుమారునకు బదివేల రూప్యములు కట్నమిచ్చుటకున్నూ, వియ్యపురాలి లాంఛనములు యావత్తు రివాజు ప్రకారం యిచ్చుటకూ నిర్ణయించుకొని అందుకుగాను మీవద్ద నూరురూపాయలు బజానాగా రొఖ్ఖం పుచ్చుకోవడమయినది. సొమ్ము నాదరంగా నిచ్చినారు గనుక ముట్టినది. ఇది నాసమ్మతిని వ్రాసి యిచ్చిన బజానా వుత్తరం.

లోభికొయ్య లింగయ్య.

(అని చదువును.)

అంక—అయ్యా! సుందర శివరావుగారూ! ఆరశీదుముక్క జేబులో నుంచండి. మ ప్పుకోసంగదా యని వ్రాయించినాను.

సుందర—బావగారూ! ఇఁక నాకు శలవు.

అంక—సరే! మీరు దయచేయండి. నేను తరువాత వస్తాను.

సుందర—శాస్త్రిగారూ! అమ్మాయికి వస్తువులు మాట మఱచిపోయినారు.

అంక—అయ్యా! వారి పిల్లయిన తరువాత నగలు పెట్టకం టూరుకుంటారూ! భారమంతయు వారియనదే! మీరు ముందుగా వెళ్ళి సొమ్ము సర్దుపాటు చేయించండి. ఆవిషయమయి నేను మాటాడుతాను.

లింగ—బావగారూ!

ఉ. పంపుడు వెంటనే ధనము ♦ బంధువులందఱు సంతసింతురా
సొంపును పెంపునుఁ గనుచు ♦ చుట్టఱికంబది ధన్యమయ్యెనా
కింపు జనించుచుండె భువి ♦ నింక విధాత యొసంగుమీకు మే
ల్పంపద లెవ్వఁడుఁ జనుఁడు ♦ సర్వము చక్కఁగఁ జేయుఁడిత్తరిఁ.

సుందర—మంచిది. నాకు శలవు (అని నిష్క్రమించును.)

అంక—లింగయ్యగారూ! మామాటేమిటో చెప్పి పంపించండి.

లింగ—కట్నము యావత్తు వసూలు కాగాని వాటాలక్రింద పంచుకుందాము.

కామ—కట్నము వచ్చిందాకా మేమూరకుఁగలమా? మాజీవనోపాయము దీనివలననేకదా! మీకంటే సాగుతుంది. మాపొట్ట గడచుట కష్టముగదా! ఏదో దయచేయించరిడి పోతాము.

లింగ—అంకయ్యా! కామయ్యను చూచావా! కజ్జాకు ముందు కాలు దువ్వుతాడు.

కామ—ధనము సంగతి తలఁచితే మీకు తగవులాఁటగా నుంటుంది.

అంక—కామయ్యా! లింగయ్యగారి యంత మహానుభావుఁడు లేడు, దమ్మిడి కూడ దాటనివ్వరు. పువ్వులలోఁ బెట్టి ముట్టచెపుతారు.

యీపాటికి పోదాము రా (లింగయ్యగారితో) అయ్యా! మాకు శెలవు (అని అందఱు లేచును. తెఱవాలును.)

3 వ రంగము

[వృద్ధవేశము భద్రావతి వడకగది]

(వృద్ధవేశము భద్రావతి)

భద్రా—ఆహా! తల్లి దండ్రులారా! ఎంతటి మహాఘోరకృత్యము గావించితి రయ్యా! యీముసలిముండాకొడుకుతో నే బాధపడలేకున్నాను. ధనమే పావనంబుగా నెంచి దంతములూడిన తాతకు గట్టి పెట్టితిరిగదా! అయ్యో! దిక్కుమాలిన డబ్బు నన్నింత పని చేయుచున్నది. ఆహా! యీముసలి వక్కాణముతోఁ గాపురము సేయుట కంటె కాటికావలా యుండుటమేలు.

సీ. తలను దువ్వినఁ లేచి ॥ తహాతహా బాదును
పువ్వులంబెట్టినఁ ॥ పొడుచుచుండు
చీరఁగట్టిన వచ్చి ॥ చీవాట్లు బెట్టును
నవ్వుతోఁ దోమిన ॥ నణగుకొనును
పాటఁబాడినఁ బళ్లు ॥ పటపట కొఱుకును
పండుకొన్నను చూచి ॥ బాదుచుండు
పొరిగింటఁ జూచిన ॥ పోకిరీవని దిట్టు
దొడ్డిలోనికి బోవ ॥ తొంగిజూచు

గీ. పనులఁ జేసిన నీపని ॥ పాడుకాను
వంటఁజేసిన నీవంట ॥ వల్లకాడు
అనుచు నిత్యంబు దిట్టుచు ॥ నదుముచుండు
అరయ కాపురంబును జేయ ॥ దరమె నాకు.

మఱియు,

చ. పుడకలు బొగ్గులుంబిడక బుట్టలు నించి యొసంగునాకునే
నడిగిన దిట్టుచుండు తన యంతట తాను యొసంగు బియ్యముఁ
గడుగును విక్రయించు నుద కంబును యమ్మును తిండితిన్నచోఁ
గొడుకును దిట్టు నేడ్పుదన కుంగల ద్రవ్యము ఖర్చుపెట్టఁగా.

ఛీ! వీని బ్రతుకుఁగాల.

ఉ. దగ్గఱఁజేరఁబోయినటు దంతములూడినబోసి నోరుతో
బుగ్గలు నంటుచుండు వల పుంగలవాని విధానజూచుతా
సిగ్గునొకింత లేకనను జేరును వాకిట నొదఱుండినన్
దగ్గును మేనుశయ్యకును దార్పగఁ దిట్టును గొట్టుచుండునో.

ఇట్టివాని గృహమున సంసారము చేయుట బహుకష్టతరము. నాపూర్వ సుకృత ఫలమింతియే కాఁబోలు (భగవంతు నుద్దేశించి) ఓయీ! భగవానుఁడా! ప్రపంచక సృష్టి కర్తవయి నీబిడ్డల పడుపాట్లు గనుచు దయారసములేక దలను దాచుకొనెదవా! పదునాఱేండ్ల బాలను ప్రాయముడిగిన లోభికి గట్టిపెట్టితివా! అందుచేత నదియెంత కష్టము ననుభవించుచున్నదో నీకుఁ దెలియునా? అహా! నిన్ను ననవలసినపనిలేదు. యీనరకములోఁ బడఁద్రోసిన నా తలిదండ్రుల ననవలయును కానిమ్ము. కష్టమనుభవింపక తప్పునా? తల్లిదండ్రులారా! దయయను మాట లేదు కదా! ధనమా మిమ్ముల రక్షించునది. అనిశము మీరు చేసిన ఘోరకృత్యమునకే కుందుచుంటిని! సర్వసుఖముల ననుభవింప వలసిన దానను సంద్రిముంబడి కొట్టుకొనుచుంటిని కదా! క్షేమములేని నాజీవము నాకేల. అవును. లోకోక్తికి లోటు గలుగునా! "పుణ్యముకొలఁది పురుషుడు దానముకొలఁది బిడ్డలని ధాత్రీజనులు నుడువుచుందురు. నేనెంత మొత్తుకొన్న నిసుమంతయు లాభము లేదు. కనుక నేనిప్పుడు కాపురమును ఖండించనేల? కాని యెంతముసలి వాఁడయినను గాపురము చేయవచ్చును. కాని పెనులోభితోఁ గాపు

రము చేయుటతికష్టము. విధాత యేమదార్థము పెట్టిలోభిని సృజియించె నోకదా. లోకులు కాకులు వంటివారు. శాస్త్రలోటయిన గంపంత చేయుదురు. (పరికించి) ఏమాధ్వని. ఆ. అదిగో దగిడ్రి కొట్టు దావ రమవుచున్నాఁడు. కాని రానిమ్ము. (అని మరుంగును.)

లింగయ్య—(ప్రవేశించి) నాలేమావిగున్న లేచినదికాబోలు. దీపాలు పెట్టకుండఁగనే పాన్పుమీద పవళిస్తుంది పొద్దున తొమ్మిదగం టలయినను పక్కవయిచుంచి లేవదుకదా! దీనితోఁ బడేపాట్లు దేవునికిఁ దెలియాలి దీనితోఁజెప్పకుండా యీసంబంధము కుదిర్చినందుకుఁ జెప్పుదెబ్బలు తగలవుకదా! (దగ్గఱకుబోయి చేయితట్టుచు) ఏమే! యిం కా లేచావు కాదు ! యింత జన్మకంయిల్లాలుకుఁ బనికివచ్చునా ! లే—లే మంచిమాట చెపుతాను. నీకుగావలసిన చీరలు రవికలు నగలు సర్వం సమకూడే సమయం సంభవించినది. లెమ్ము నామాటమీఁద గురి యుంచవే !

భద్రా—(మూల్గుచు) నీయిల్లువల్ల కాడుగానూ ! సూర్యోద యం కాందే నూదులు పుచ్చుకొని లే లే యని పొడుస్తారేమిటి. రాత్రి రెక్కలు ముక్కలయేటట్లు చాకిరి చేసి చేసి పండుకొనేటప్పటికి పండ్రెండుగంటలయినదికదా ! కాసేపు కాళ్లుజాపుకొని పడుకుందా మంటే రుణం లేదుకదా! పడుకున్నది లగాయితు లేచేవరకు పళ్లు పట పట కొఱుకుతుంటారుగదా ! నాకే విధానసుఖం లేదుకదా. నారా యణ. నారాయణ. నాబ్రికుకు గాలిపోను. నగలా, నాణెములా నాల్గు రోజులు భోజనముమాని తే నాటకముకదామీకు. (అని కళ్లు నలుపు కొనుచు లేచును.)

లింగ— అమ్మా ! అమ్మా ! యెంత లేసి మాటలంటున్నావే. దగ్గఱకుఁజేరితే దవడమీద లెంపకాయలుగదా! దూరానకుఁబోతే

ధూముదాంలు. కనపడకపోతే కర్రతీస్తావుకదా! నాకర్మముకాలిపోను. నాల్గుపెండ్లిండ్లు చేసికోబట్టి నాకీ తిప్పలువచ్చితిల్లాయి. డెబ్బయియవత్సరముల దౌర్భాగ్యునకు నాల్గోవివాహమేమిటి? బ్రతికిన నాల్గురోజులు మర్యాదుంచవే— యేశుభవార్త పలుకుదామన్నా పోట్లాటసిద్ధము. తలచిన కార్యము కాక తగువులాటయినది.

భద్రా— మీరు చెప్పే శుభవార్తలు చూడలేక మాడుతున్నాను. ధనమో! ధనమో! యని తనువుతగలపెట్టుతారు కదా; దమ్మిడికోసం దవడలబాదుకుంటారు.

లింగ— ఆసాయంత్రము నీతో జెప్పిన పెండ్లి వారు నిన్నను వచ్చారు. అబ్బాయిని చూచారు. సంబంధమునిశ్చయించుకున్నారు. పదివేలురూపాయలు కట్నము—

భద్రా— (మాటకడ్డమువచ్చి) మీకు కట్నం కట్నం అనిగోలయేకాని ఆడపడుచులాంఛనములు వియ్యపురాలు లాంఛనములు తలపెట్ట గదా?

లింగ— నీకడుపు బంగారముకానూ! ఆమాటయే చెపుతూయుంటే మాటకడ్డతగిలినావు. అందుచేత చెప్పుటకు వీలుయిచ్చినది కాదు. శ్రద్ధగా వాలకింపుము. ముందు నేనడిగిన సంగతులివి. వియ్యపురాలు లాంఛనములు రివాజు ప్రకారమ్ము ముట్టచెప్పవలయునని ఖరాఖండనతో జెప్పినాను.

భద్రా— రివాజుప్రకారము అంటే వారిష్టప్రకారము యిచ్చియివే రివాజు అంటారు.

లింగ— అంత తెలివితక్కువవాడనా! తరువాత వియ్యపురాలు లాంఛనములు వివరంగా కాగితముమీద వ్రాయించినాను వినుము. అయిదురోజులు అయిదు పెద్దచీరలు, అయిదుమోహిరీలు, అయిదు

పెద్దకాసులు, అయిదు కుర్చీలు, అయిదుబొట్టుపెట్టెలు, అయిదు వెండి పలుదోముపుల్లలు, అయిదు కాటుకకాయలు, అయిదువెండి కుంకమ భరిణెలు, అయిదు శెంటుబుడ్డులు, అయిదు పన్నీరుబుడ్డులు, అయిదురకముల అద్దములు, తరువాత వియ్యపురాలికి కావలసినంత కంజాయింపు చేయించవలెనని స్పష్టముగాఁ జెప్పినాను.

భద్రా—ముహూర్తము నిశ్చయించినారా యేమిటి.

లింగ—ఆ! నిశ్చయించినాము. ఇరువయి రోజులున్నది.

భద్రా—కోడలకు నగలేమి పెడతానన్నారు?

లింగ—కోరిననగలు పెడతానన్నాను.

భద్రా—ఆఁ మీరుపెట్టినట్లే. ఆపిల్లసుఖపడినట్లే. చాలు చాలు నేను మిమ్ములను పెండ్లియాడి యింతఅనుభవిస్తున్నాను. మీఅబ్బాయిని పెండ్లియాడి ఆపిల్లయింక అనుభవిస్తుంది!

లింగ—నీకెందుకే యాగొడవ.

భద్రా—తల్లిదండ్రులకు దెలియక మీఅబ్బాయికి గట్టిపెట్టారుకాని తెలిసినవాళ్ళు మీఅబ్బాయికివ్వరు. సరేదానికేమిగాని నాకుఁ బెండ్లికి చీరలు కొనరూ! నగలుచేయించరూ! నలుగురిలోనికి వెళ్లినప్పుడైనా నగలివ్వరా యేమిటి?

లింగ—వియ్యాలవారు విరివిగా పుట్టచెపుతానన్నారు. అందులో నాకేమియు నక్కఱలేదు. అంతా నీవే అనుభవించు. తిరిగి యిప్పుడు మళ్లీ డబ్బుఖర్చు పెట్టుటెందుకు?

భద్రా—సరే! మీయిష్టమువచ్చినట్లుచేయుండి. కొనుటకిష్టము లేనప్పుడు గొంతుకకోసికొన్నా కొనరు,

లింగ— అబ్బా! అస్తమానం నన్ను బాధపెట్టకే పెండ్లింకాయిరువదిరోజులున్నదికదా. యీలోపుగా చేయించలేనా

యేమిటి. నాకుఁ జాలాపనియున్నది. వ్యవహారపుఁబనులు త్వరితముగాముగిం చవలయును. నీవు పెండ్లిపనులన్నియుఁ జక్కఁజేయుము. కావలసిన సామాగ్రియంతయు సిద్ధముచేయుము. నేనుబజారునకు వెళ్లి సామానంత చాకలివానిచేతఁ బంపిస్తాను. జాగ్రత్తచేసి సర్దుపాటుగావాడుము. నేను పోయెదను. (అని నిష్క్రమించును)

భద్రా—అబ్బా—యిప్పటికి యీపోరువదలినది.

చ॥ వనమున గాపురంబు సుఖవర్తముతో నొనరింపవచ్చు నా
వనధినిఁ గ్రుంగవచ్చుఁ గులపర్వతముల్ సుకరంబు దాటవ
చ్చును విషమున్ భుజింపనగు చోరులఁ బట్టఁగవచ్చుఁగాని ధా
త్రిని పెనులోభితోఁగలసి రేఁబవలున్ జరియింపసాధ్యమే

సృష్టికర్త లోభి నేవిధముగా నే పదార్థముఁబెట్టి సృజించెనో కదా?

(తెరవ్రాలును.)

## నాల్గవరంగము

ప్రదేశము—సుందరశివరావుగారి గృహము. ప్రవేశము.—సుంద రశివరావు—గుణవతి.

సుంద—తరుణీ! ఆడుబిడ్డలుగన్నవారి జీవనము కష్టతరము సుమీ!

ఉ॥ ముద్దుగ బిడ్డలంగనిన ముద్దుగఁ బెంపఁగ నొక్కచింత, నే
ర్విద్దెలు నేర్పఁ జింత, పృథివీస్థలియందు వరుండుఁగూర్పగా
దద్దయుఁ జింత, వారలకు దారధనాదులఁ గూర్పఁజింత, నా
కెద్దియుఁ దోచకుండె హృదయేశ్వరి నేఁడిఁక నేమిసేయుదున్.

గుణ—నాథా! మీరు వెళ్లినపని యేమాయెనది.

సుంద—నేను వెళ్లినపనియంతయు బాగుగానే నెరవేరినది. పాపము అంకయ్యశాస్త్రిగారుండఁబట్టి ప్రతివిషయముం గొనసాగినది.

సంబంధం స్థిరపడినది. పదివేలరూపాయలు కట్నం వియ్యపురాలు లాంఛనము రిహాజుపర్కారంజరుపవలయును. కట్నం పెండ్లికిముందుపదిరోజులు ముందుగా బంపించమని చెప్పినారు. ఇప్పుడుపదివేలరూపాయలు నాకెక్కడ సంభవించును. సంబంధము కుదిరినదాకా యొకగోల, కుదిరినతరువాత యొకగోల, కట్నము పంపనిదే కార్యసన్నాహములు చేయరట. రొఖ్ఖంనావద్ద ప్రస్తుతంలేదు.

గుణ—లింగయ్యగారి కుమారుడేనా?

సుందర—అవును. ఇదివఱకునుంచి చెప్పే గొడవంతాయేమిటి?

గుణ—సంబంధము చక్కగానే కుదిరినది.

సుందర—పదివేలురూపాయలు వదలుచున్నవి.

గుణ—అబ్బా! కట్నము చాలావఱకు పెట్టారు.

సుందర—పెట్టబట్టే కుదిరినది. వియ్యపురాలుకు పయివ్యాపారమునకు మొత్తం పండ్రెండువేలురూపాయలు కావలయును. లేనిదే కార్యము నడవదు.

గుణ—కానిండు. ఈభారము కూడా అంకయ్యశాస్త్రిగారి మీాదే మోపండి.

సుందర—ఎన్నివిధంబుల ననుకూడినను కార్యముసానుకూలపడుట చాలకష్టము. చూచితివా! కట్నమేపంపకుండిన కార్యముచేయనని నాకు లింగయ్యగారు చెప్పినారు.

గుణ—ఆలస్యమేల? త్వరగాభోజనముచేసి అంకయ్యగార్ని తీసికొని సొమ్ముకుదారిచూడండి.

సుందర—సరే! ఆలాగునే చేసెదను.

అంకయ్య—(ప్రవేశించును) సుందరశివరావుగారూ! సొమ్ము పంపించుటకు వాయిదాసమీాపించినది ఖద్రముచేసినారా?

సుందర—దానిమాటయే తలపెట్టుచుంటిమి.

గుణ—దైవములాగున మీరుమాకు సహాయముచేయుచున్నారండి.

సుందర—శాస్త్రిగారూ! యీవిషయమయి లింగయ్యగారిమధ్యన యేమయిప్రాస్తావించినారా?

అంక—నేను వచ్చునప్పుడే లింగయ్యగారూవర్తమానం పంపించినారు. లేవబెల్లుట నీయకతప్పదు. గడాణామనుష్యులతోం బని.

సుందర—అవును. పంపకతప్పదు.

గుణ—శాస్త్రిగారూ! మాఅమ్మాయికి కష్టముగానున్నదండి కట్నమిచ్చుట.

అంక—పసిపిల్ల అమెకేమితెలియునులెండి. ఇద్దరకూ వివాహముచేస్తే చిలకాగోరింకలలాగున పడియుంటారు. పిల్ల లాలోచన మనము వినడమూ అప్రకారంచేయుడం బాగుండదు. అన్నియుమీకే తెలియును.

సుందర—అయ్యా! అంకయ్యగారూ! ఆలస్యముతోం బని లేదు. అప్పునకుబారిమీరే చూపించవలయును. అంతామీదేభారము.

అంక—ఈరోజులలో అప్పు పుట్టుట మహాకష్టంగానున్నదండి. వడ్డీలుమహావాటంగానున్నాయి. నూటికి రూపాయితొమ్మిదణాలు పుచ్చుకుంటున్నారు. కోమటి కోటయ్యఅనువర్తకుఁడుగలఁడు. అతనితో మాటాడి యావత్తుసంగతి మీకుచెపుతాను. మీరుకూడాభోజనము చేసి మాయింటికిరండి. (అంకయ్య నిష్క్రమించును.)

సుందర—అమ్మాయీ! నీలాంబరీ! యిటొకసారిరమ్ము.

(నీలాంబరి ప్రవేశించును.)

నీలాం—తండ్రీ! యేమియాజ్ఞ?

సుందర — సంబంధము వచ్చినదా ?

నీలాం — నాయనా ! నామనవియాలకింపుడు.

సుందర — ఏమిటమ్మా నీకోరిక ?

నీలాం — తండ్రీ ! వంశుడు రాచారములు నాశము చేయుటకుఁ జేతికి కంకణముగట్టితివిగదా ! అట్టినీవు నేడు కట్నమిచ్చుట పాడియా!

సుందర — ఏయెండకాగొడుగు పట్టవలెను.

గుణ — వెఱ్ఱిదానా ! లోకజ్ఞానశూన్యవు. నీకేమియు తెనియదు కాఁబట్టి యిట్లుపలుకుచున్నావు.

అమ్మా ! నేను త్రికరణశుద్ధిగఁ జెప్పుచుంటిని-కట్నమిచ్చినవ రుని నేఁబెండ్లియాడను. త్రికరణశుద్ధిగాఁ జెప్పితిని.

సుందర — అమ్మాయీ ! నీవు చాలాచిన్నదానవు. నీకు బట్టు గూడదు. కాలమునుబట్టినడువవలయును.

నీలాం — తండ్రీ ! ఉన్న మడిమాన్యములనమ్మి పెండ్లిచేసిపి మ్మట నేమిగావించెదవు ? తినుటకుతిండి యుండవలయునా? నేను మిమ్ములను దయతోఁ జూచుచుంటినే ! ఇట్లొనర్చుటపాడియా !

గుణ — అమ్మాయీ ! ఇంత పెంకిపట్టుగూడదు. కొంచము మామాట పాటిచేయుము.

నీలాం — అమ్మా ! నాయభీష్టము వ్యతిరేకింపఁజాలను.

(అని నిష్క్రమించును.)

(తెరవ్రాలును.)





# వరవిక్రయము



## చతుర్థాంకము.

### మొదటిరంగము.

(ప్రవేశంసుందరశివరావుగారిగృహము.)

కనకాంబ—(చేతిలో ఛాయాపటమునుం చుకొని ప్రవేశించును.) మాఅక్కయ్యకు లభియించిన వరుండు మిక్కిలి చక్కనివాఁడు. వీనిని అసాధారణముగా సౌధాంతమునుండి వీక్షించియుండుటయే కాని పరిశీలించి యెన్నండుఁ జూచియుండలేదు. ఈపటమునుఁ జూచిన కొలఁది నామనస్సు మేరలేని యానందమందుచున్నది. కాఁబట్టి నేముందుఁజూచి పిమ్మట సహోదరికిఁ జూపించెద (అని పటమునుఁ జూచుచు) ఆహా! వీని యందచందంబులేమని వర్ణించెద.

ఉ. కన్నులు పద్మపత్త్రముల కంటె విశాలములయ్యెఁ జంద్రునిన్
వన్నెను మించెమోము, పదివే వందల నిచ్చిన సాటివాని నిం
కెన్నఁడు గాంచలేము, తను వెంతయు వారసి చూడఁగాను య
త్యున్నతమయ్యె, మారుఁగడు యొక్కఁగనుండె వరుండు ధాత్రిపైఁ

అక్కా, ఒకతూరి యిటురమ్ము. నీకు మిక్కిలి చక్కనివింతఁ జూపించెద!

నీలాంబరి—(త్వరతోఁ బ్రవేశించి) చెల్లీ! ఆవింత యేమే!

కన—(పఠము చూపించి) ఈచిత్రము నచిత్తరువుఁ గాంచితివా?

నీలా—దీనిలో నేమిచిత్రమున్నదే! నీ వెప్పుడు గోరంతదానికిఁ గొండంత చేసెదవు.

కనకా—అక్కా! కన్నులకు గట్టినట్టు స్పష్టముగా ఛాయా పఠములో బాలుఁడు గనిపించుచుండ ఏమి చిత్రమని అడుగుచుంటివేమే!

నీలాం—ఏమో! నాకుఁ దెలియదు. దీని నెన్నఁడు నేఁజూడ లేదు. నాకంతయు నడవిగా యున్నది.

కనకా—ఏమిచిత్రమా! బావగారి చిత్రము.

నీలాం—ఏబావగారు!

కనకాం—ఇంకా ఏబావయని అడుగుచుంటివా! నాన్న గారు నానాకష్టములఁ జెంది పదివేల రూపాయలకు వేలములోఁ గొన్న బావ! ఇప్పుడు బాగాఁజూడుము.

తే. గీ. చూపులకు సుందరుండు నీ కే వాపుతీర
కాని వేలంబులో గొన్న కాంతుఁడయ్యె
కట్నమునకుఁ దగ్గవరుండు కాదు అక్క!
ఇట్టి వానిని నీకేల గట్టిపెట్టె.

నీలాం—ఇవియా! ఇంక చూడ నక్కఱ లేదు. చూచి నందుకుఁ గూడ సుంకంబు చెల్లించవలయు నేమో!

కనకాం—ఆలాగు ననుచుంటివేమే అక్కా! కాళ్లరిగఁ దిరిగి కష్టపడి నాన్నగారు నీకు సంబంధము చూచి వరుని ఛాయాపఠము తీసికొని వచ్చినందు కయినను చూడవే. పన్ను చెల్లించినయైనఁ జూడఁ దగిన పఠమ్మే. ఎందుచేత నంటివా!

తే. గీ. ఇల్లుమాన్యంబులమ్మి గ్రహించినట్టి
వరుడుఁ యూతండు లభియించె భాగ్యవశము

చేత, ముందుగాఁ బరముఁజూ । చిన నశించుఁ
భాగమంతయు నేత్రముల్ । బర్వమాను.

నీలాం.—చెల్లీ ! నన్ను వేళాకోళముఁ జేయుచుంటివా?

కనకాం.—అక్కా ! వేళాకోళమేమి యున్నదే ! భారతదేశమునందిట్టి యభాగ్యులు బయలుదేఱినందుకు నేనీమాటలు బల్కితిని. కాని నిన్ను దెప్పుటగాదు సుమా ! అయినను అక్కసెల్లెండ్రు వేళాకోళములు చేసికొందురా !

నీలాం.—ఆతలంపుయే ; నాతలంపుకూడ. అందువలన నే నీ వరముఁజూచుటకు భయపడుచుంటిని. ఆహా! వరశుల్కములవల్ల కాలమేరీతి గొడ్డటిపోయినదో తిలకించితివా !

ఉ. భారతదేశమావిమల । భాసురకీర్తి నశించెఁ గట్నముల్
గోరెడిమాన్యులున్ బెఱిగె । కోవిదుఁడొక్కఁడు సేయు పెండ్లి వ్యా
పారము భంగిగాను నడు । పంగఁ దలంచిన వారెకాని యా
తీరున నుండఁగూడదని । తెలికగా వచియింపలేరుగా.

సీ. మానాభిమానముల్ । మంటలో గలసి క
ట్నాలగోరెడు దుష్ట । మనుజుఁడొకఁడు
సమయంబులేకను । సాధించి లాంఛన
ములు కోరు ధాత్రిలో । మూర్ఖుఁడొకఁడు
పిల్లనిచ్చిన వాని । యిల్లునమ్మించి స
ర్వంబు హరించు య । భాగ్యుఁడొకఁడు
నీతిజాతులు లేక । నీవె దేవుఁడవని
ద్రవ్యంబులాగఁగాఁ । దలఁచు నొకఁడు

గీ. వంతువుల క్రింద మరికొంత । బాధ జేయు
మాటిమాటికి సాధించి । మఱియొకింత



కూడబెట్టును చివరకు కే గోతుఃగోన
దింపు కన్యదాతను నేడు కే దేశమందు.

కాఁబట్టి వరులను కట్నము లొసంగి పెండ్లియాడకూడదని కలికాలకా పురములీతి బాధలచే తెలియుచున్నవి. అందువలన కట్నముల కాంతుని యవ్వలఁ బెట్టుము. అందచందములతోఁ బనిలేదు. ఈమధ్య నాయన గారు పడుబాధలు నీవెఱుంగవా !

కనకాం.—ఆ ! ఎఱుఁగకేమి! అన్నియు నెఱుఁగుదును,

నీలాం.—ఎఱిఁగియుండియేనా ! ఇటులాడుచుంటివి.

కనకాం.—నీముక్కలు వారుఁ జాలశోచనీయముగా నున్నవి.

నీలాం.—అవును కాని-ఆపరము నీకెక్కడ లభియించినది.

కనకాం.—పెండ్లికుమారుని తండ్రి శుభలేఖలలో వేయించ మని పంపించినారఁట.

నీలాం.—అబ్బా ! ఎంత మాటాడితివే! చిల్లిగవ్వకు చిక్కులు పెట్టుపెండ్లికుమారుని తండ్రి పంపించునా!

కనకాం.—పెండ్లి తొందరగాఁ జేయువలెనని యుద్దేశముతో ఛాయాపటము పంపించి శుభలేఖలనచ్చొత్తించుమని చెప్పినారఁట. తరువాత నాయనగారిని దానికయిన ఖర్చును పంపుమన్నారఁట.

నీలాం.—ఇప్పుడే యింతవంతములు వచ్చినవా !

కనకాం.—రావా మఱి ! సంబంధము దాటిపోవునేమో యని పంకోచముచేత మీఅత్తవారు అడావిడి పడుచున్నారు.

నీలాం.—పుష్ ! ఊరకుండుము. నాయనగారు వచ్చుచు న్నారు. (అని లోనికిఁ బోవును)

సుందర.—(చావడిలోనికి వత్తురు)

కనకాం.—నాన్నగారూ ! ఈపాటో అక్కయ్య మామగారు పంపించారఁట.

సుంద—(చూచి) సరే! బాగున్నది. నీదగ్గఱనుంచుము. మీ యమ్మ నొకసారి యిటు బిలువుము.

కనకాం—అదిగో! అమ్మ ఇటే వచ్చుచున్న యది.

(అనినిష్క్రమించును.)

గుణ—వెళ్ళినపని అయినదా!

సుందర—పనిఅయిన యెడల బాగుగానే యుండును.

గుణ—ఇంతకు నచ్చబుట్టినట్లా!

సుందర—పుట్టినచో నీగొడవంతయు నెందుకు. నాగ్రహస్థితి బాగుగానే యుండును. మనయొక్క భూమి మీదను యెనిమిదివేల కంటె నెక్కువనిచ్చువారగపడలేదు.

గుణ—మనకుఁ గావలసిన ద్రవ్యమెంత?

సుందర—పదివేల రూపాయలు చిల్లరమల్లరగా నుండవల యును.ఎలాగున చూచినను మొత్తము పండ్రెండు వేలరూప్యములు కావలయును. లేకున్న కార్యము కాదు.

గుణ—అందులకేమి చేసినారు.

సుందర—ఆస్తియంతయు నమ్మివేయుటకుస్థిరపఱచుకున్నాను. కాని యది మాత్రము చేయఁగలమా!

గుణ—అన్నట్లు అదుగో మన మాటల్లోనే యాయనయు విచ్చే సినారు.

అంకయ్య—(ఆయాసముతోఁ బ్రవేశించి)

చ. తిరిగితి నెల్లచోటులకుఁ జెల్లముగా వచియించినాడ మీ
వరముల నన్నియుఁ ధనము పత్రములేక నొసంగమంచు ని
క్కరణి వచించినారు మఱి కాగితమిప్డు రిజిష్టరీ సదా
జరుపమటంచు బల్కిరి విచారము లెంచు కు లెందు పోయెదన్.

కాఁబట్టి తలఁచుకొన్న కార్యముఁ జరుగవలయును. ఆలస్యంఅమృతము విషము అన్నట్లు" కాలయాపన చేయరాదు. మనకు వేయిజన్మములెత్తినను తలఁచుకున్న యీసంబంధము లభించదు. భాగ్యదేవత మీయందు తాండవమాడుచుండుటచేత అదృష్ట వశాత్తూ అనుకున్న రీతిగాఁ జరిగినది.

తే. గీ. ధనము లేదని మదిలోనఁ దలఁపవలదు
మీకులోకైన పనులెల్ల మేలుగాను
చేయఁ దలఁబోసి యున్నాఁడఁ జిత్తమందు
కోర్కె శీఘ్రంబు ఫలియించు కుంద నేల !

గుణ—ఆలోచనమెందుకు. చేయఁదలఁచిన కార్యమేదియో వేగము చేయుఁడు.

సుందర—అయ్యో ! శాస్త్రిగారూ ! చెడియమ్ముకొన్నను ధనము సరిగా వచ్చుటలేదుకదా ! కానిండు. అమ్మకము చేయక తప్పదుకదా ! మీరు ముందుగాఁ బోయి దస్తావేజు వ్రాయింపుఁడు.

అంక—సరే నేనుఁ బోయి సర్వకార్యములుసిద్ధముగా నుంచెదను. మీరు భోజనం జేసి వ్యాపారమునకుఁ గావలసిన రికార్డునంతయు తయారుగా నుంచండి. నిమిషంలో నేను కూడా భోజనంచేసి వస్తాను.

(అని నిష్క్రమించును.)

గుణ—సరే ! మీరు త్వరితముగా స్నానముఁ జేయుఁడు.

సుందర—ఏమి స్నానము. ఏమిలోకము. నామానసమెంతయు ఖులాసాగాలేదు. ఈవదియకరముల భూమిగూడ అమ్మివేయుచుంటిమి కదా. మన జీవనోపాయమెట్లు ?

గుణ—మీరే. అట్లను చుంటిరి. ఇంక నీయబలబ్రతుకేమి కావలయును.

సుందర—పిచ్చిదానా! అధైర్యమెందుకు (ఆలోచించి)

మ. ధరఁజన్మించెను జీవసంతతికి సం / తాపంబు కష్టంబులున్
చిరమైయుండవు కొన్నినాళ్లు ధనమున్ / జేకూర్చు దారిద్ర్యమున్
మఱికొన్నాళ్లు వశింపఁజేయు దనరూ? పంచేమియున్ జూపకన్
బరగంగాఁదలఁబోయు దండ్రి మానలన్ / బాలించి పోషింపఁడే

గుణ—అవును. నిజమే. పుట్టించినవానినిఁబోషింపకమానునా.

తే. గీ. సర్వజీవులఁ గన్నయా / జలజభవుఁడు
అఖిలప్రాణుల రక్షించు / నాదరమున
బ్రహ్మకల్పంబులోఁ బుట్టి / బ్రతుకనెంచి
యున్న మనల నతఁడు గావ / నున్నవాఁడు.

సుంద—సరే బాగున్నది. కాలమతి క్రమించుచున్నది. నేను శీఘ్రంబు గాఁబోయి పనులు నెరవేర్చుకొనవలయును. లెమ్ము.

(అనినిష్క్రమించిరి.)

రెండవరంగము.

ప్రదేశము-(కోమటి కోటయ్యగృహము) (ప్రవేశము. అంకయ్యగారు)

అంకయ్య—సుందరశివరావుగారికి పదిహేనువేల రూపాయలు కావలెనఁట. మాన్యములెనఖా యిచ్చెదరు. వారి స్థితిగతులు నీవెఱుఁగుదువుకదా!

కోట—ఎటిగుండబట్టె ఇస్తాననడము. వడ్డీర్వూపాయి త్తొమ్మిదణాలు తక్కువ పడను. నేను పదిహేనువేల రూపాయలకంటె యెక్కువ యియ్యలేను. అది అంతకంటె యెక్కువ కిమ్మతుచేయదు.

సుందర—వారంరోజులలో కావలయును. మాన్యమునంతయు విక్రయించెదను; క్రియమునకుఁ గొనుఁడు.

అంక—కోటయ్యా! అలాగున కానిమ్ము. మొత్తంగా నీవే కొనుము పద, దస్తుతీసికొనిరా?

కోట—నేను మొత్తము క్రియానకయితే వదమూడువే లిస్తాను.

అంక—ఆరెండువేలుకూడా కట్టుకొందు. మంచి ధాన్యంవండే భూమి. యకరం రెండువేల రూపాయలు చేస్తుంది. వదియకరములు భూమికదా !

సుందర—కోటయ్యగారూ ! ఆలాగున చేయండి.

అంక—(కన్నుగీటుచు) కోటయ్యా! వేరభిప్రాయమేల! నీ వెందుకు సందియమొందెదవు ! త్వరగా కానిమ్ము.

కోట—శాస్త్రిగారూ ! చంపుకు తింటారండీ

అంక—త్వరగా లేది దస్తుతీసికొనిరా !

కోట—రిజస్టరీ ఖర్చులు మీవే. నాకు నిమిత్తములేదు. stamp తీసికొని వచ్చారా. లోపలకురండు సొమ్మిచ్చెదను.

(తెరవాలును)





# వరవిక్రయము.

## పంచమాంకము

### 1 వ రంగము

(ప్రవేశము నీలాంబరి—(పడకగది)

నీలాం—ఆహా! జనకా! అనిసంతయుఁ జేసితివా! అక్కటా! కాలమెంతగాఁ బరిణమించుచున్నది. కట్నములు గోరువానిని నేఁ బెండ్లి యాడనని పలువిధంబుల బోధించినను మా జననీజనకులు నామాట పాటింపరుకదా!

ఉ॥ చెప్పితినెల్ల సంగతులు జిత్తమునందు ననేకభంగులన్
దిప్పితి మొత్తుకొంటి నిట రేఁబవలున్ వచియించితండ్రితోఁ
దప్పిదమంచు దెల్పితిని దండములెన్నియొ సల్పియుంటి తా
నొప్పుకొనంగ లేదు మది నోర్వఁగశక్యమె భూతలంబునన్

చివరకు సిగ్గు విసర్జించి భాషించుట తప్ప వేరుపయోగము లేదు. దైవమా! అబలబ్రతుకెంత చులకనబ్రతుకైనది!

శా॥ స్వాతంత్ర్యంబొకయింత లేదు మదిస్వేచ్ఛాప్రవృత్తి లేదెందు నే
రీతిన్ గౌరవమున్ గనంబడదు పాటింగీర్తి మెప్పేమియున్
నాతులగ్గల లేదు కట్నములు మాన్యంబుల్ సమర్పించి ప్ర
ఖ్యాతిన్ బెండ్లిని జేయఁగావలసెఁ గన్యాదాతధాత్రిస్థలిన్

ఓయీ! తల్లిదండ్రులారా!

ఉ॥ పెంచియుఁ బెద్దఁజేసి కను । విద్యలు నేర్పి వివాహమిప్డు కా
దంచుఁ దలంచి మాన్యుల । నమ్మికడుంగడు గట్నమిచ్చి మీ
రెంచితిరే వివాహమున । రింపఁగఁజాలునుఁ జాలుమీకు తే
దంచును భోజనంబు హృద । యంబున నాకు విచారముంచరే.

వెండియు.

చ॥ ధనముగలానికింసిరులు । ధాత్రిని మీరొసగంగ భావ్యమే
తనయను ముద్దుగాఁ బెనిచి । దానము జేసిన పుణ్యముందు మీ
తనువు ఫలించు, లోకులు న । దాకొనియాడరె! మిమ్ము బీదకుఁ
ధనము నొసంగి పెండ్లినను । దద్దయుఁ జేసిన సౌఖ్యమందనే.

తండ్రీ! నీవేకదా! సంఘసంస్కర్తవై చెలరేఁగినావు. కట్నములు నీయగూడదని వేదికలపై నెక్కి యుపన్యాసము లుక్కిరి బిక్కిరిగా నిచ్చినావు. అట్టిమహానుభావుండవు నేఁడు నీవీపనిఁజేయ భావ్యమా? నా పెండ్లికయిన నీవు పడినశ్రమలు లిఖింపశక్యమే! అంతకట్నమొసంగి పెండ్లిఁజేయుటకంటె బీదవానికి యాకట్నమొసఁగి వివాహముఁ జేయుట యుక్తము. నీవిటులఁ జేయఁబాడియా?

ఉ॥ కట్ట! గృహంబు లమ్మకొని । కట్నములియ్యఁగఁ బాడియానె! నేఁ
బుట్టిన దాదిగాసుఖముఁ । బొందఁగలేదు వియోగసాగరం
బట్టిరి నేఁడు, నావరుని । శ్రీమంగళసూత్రము బొందినుంచి నే
నెట్టుల జీవముందు నవ । నిక జనులందఱు బ్రువదిట్టరే.

అహా! నేనిటువంటి మహాఘోరకృత్యము భరింపఁగలనా! పెద్దలనాటినుండియు పేరువహించినను మనమాతృభూమియందిటువంటిసంఘదురాచారములు చేయవచ్చునా? ఓయీ! తండ్రీ- నీవే నడుముఁ గట్టుకొని సంఘదురాచారములు తొలఁగించుటకుఁ బాటుపడితివే: అట్టినీవుతిరిగి

యిటులొనరింపఁ బాడియా! అనేకోపన్యాసములలో నధ్యక్షుఁడవుగా నుండి సంఘదురాచారములు చంపఁదలఁచితివే చాలు. చాలు, సాహసించి నీవీపనిఁ జేయుచుంటివా?

తే॥ గీ॥ ఆదినుంచియుఁ బెద్దలు నడుగునంట
జేసి కట్నము, బయటకుఁ దోసి నీవు
నడుపఁదలఁచితివే! తద్బాధ న్యాయమవునె
పూజ్యతరమైన మనపుణ్య భూమియందు.

ఇదియంతయు భారతమాత దురదృష్టము. లేకున్న పూర్వమునుంచి లేని దురాచారము నేఁడు పుట్టనేల. ఓయీ! మహాజనసమూహములారా! యీ భారతజనని గర్భంబున నుదయించి సంఘదురాచారము మాన్పింపఁ జాలకుండిరిగదా! ఆహా! పెండ్లిండ్ల బాధయొక్కటియా!

ఉ॥ వేలకు వేలుగట్నములు వియ్యపురాలకు లాంఛనంబులున్
జాలదు కాలముల్ వ్యయము సల్పవలెన్ గడుగాంచనంబులే
లీలను, మెట్టగావలెను లేతగదా, మగవారికిప్పుడున్
చాలును చాలుధాత్రినిఁక శక్యమె! పెండ్లిని జేయుటిప్పుడున్.

హా! పరమేశ్వరా! దయాసాగరా! నీకాలచక్రంబు నీలీలఁ ద్రిప్పుట పాడియా! నీయవతారము లతిచిత్రములుగదా!

ఉ॥ చక్రము దాల్చి నీవు రిపు చక్రము ద్రిప్పు టదేమి వింత నీ
వక్రమమే, యొనర్చు నడ నాగునె! యీ చతురబ్ధులున్ మహీ
చక్రము లాత్రిలోకములు సారసనేత్ర! కృపారసాంగ చేఁ
జక్రముదాల్చనేల పలు చంపడెఁ బెండ్లి ధరాతలంబునన్.

కృష్ణా! జగద్బంధూ! కోరికలీడేరక కోటిగొలంది జనంబులుర్విని గూపంబునఁ బడుచున్నారుకదా!

శా॥ ఓయీ! తండ్రి, కృపాబ్ధిచంద్రమ! మహా ఓంకారరూపంబుతో
గాయంబున్ సృజియించినావు ధనమున్ గల్పించి సౌధంబులున్

మాయామర్మములేకఁ బెట్టితివి నా మర్యాద గాపాడఁగా
నీయగ్గింబడి మ్రగ్గిపోయెదను నీ వెంతేనియున్ దిట్టినన్.

కావున - నాతల్లిదండ్రులకు దుష్ఖ్యాతి రాకుండఁ గాపాడుటే ధర్మము. హా! భారతమాతా! నీపవిత్రగర్భమునందనేక జనులుదయించి సౌఖ్య సాగరమున నోలలాడుటలేదా! నాకేల నీవట్టిదౌసంగలేదు? నాతల్లిదండ్రులు నోచుకొనలేదు. నాకేల నీదుఃఖాబ్ధిని మునుంగవలెను. తల్లిదండ్రులకు సంఘబాహ్యంబు గలిగింప మనంబొప్పకున్నది.

తే॥ గీ॥ తల్లిదండ్రులు ప్రేమారఁ దపముఁజేసి
కన్నపుత్రిని, నన్ను దుఃఖంబునందు
త్రోయఁగా భావ్యమేతల్లి తోయజాక్షి
ఆడువారల, పుట్టువప ఖ్యాతిగాదె.

భగవంతునివ్రాత తప్పింప నెవరితరము. నాపుట్టుకవల్ల తల్లిదండ్రులకు గష్టములేకాని సుఖములు లేవుకదా. భూమాతకు భారభూతమైన శరీరమెందుకుభగవంతుఁడు సృష్టిచేసెనోకదా! ఓతల్లీ — సకలసద్గుణనికురుంబా! నీగర్భంబున నుద్భవించినందులకు నీకుఁ గష్టమేకాని యానందము లేదుకదా! అమ్మా! యేమి చేయవచ్చును. ఈశిక్ష నేనభవింపక తప్పదు. ఆహా! భగవంతుఁడా! పశువులకుఁ గీటకములకునరులకు సహజమయిన కాలమరణమును నాకుఁగూడ పెట్టక నిట్టియకాలమరణమునందు వయిన బలవన్మరణమును నాకేల తెచ్చిపెట్టితివి. హా! తండ్రీ! నామాటవినకపోతివికదా! ఉన్న భూముల నమ్మి నాకువ్వాహ మాచరించిన సహోదరి వివాహమెట్లు సాగింతువు. భూములమ్మిన పిమ్మటనీవొనరించు కార్యమువీసమయినను లేదుకదా! తరువాత ముష్టి మెత్తుదువా. నేను బ్రతికియుండినా దారిద్ర్యదుఃఖమును గాంచనోపను. నీకు రాఁబోవు సంఘదూషణమును చూచి నేను భరింపఁజాలను. నాకట్టి

సాహసము గూడదు. ఆత్మహత్య ఘోరపాపమని పెద్దలు చెప్పుచుందురు అయినను అట్టిదనుభవింపక తప్పదు. తల్లిదండ్రులారా! తరువాత విచారించిన లాభమెంతమాత్రమును లేదుగదా? యని రాత్రింబవళ్ళు యేడ్చినను లెక్కసేయక పోతిరిగదా! శ్రీమన్నారాయణమూర్తి యాజ్ఞ యనుల్లంఘనీయము, అమ్మా! తండ్రిగారు పరమపూజ్యులు. పరుల ననవలసిన పనిలేదు. నేనుఁ బుట్టకుండిన యెడల మీకీ దురవస్థతటస్థించి యుండదు కదా! తండ్రీ! నేనెంత వారించినను నావాక్యములు వినక సంబంధము తెచ్చినందుకు ఫలమనుభవించెదవు. ఇది నాదోషమే! అమ్మా! నన్నుఁగని పెట్టియుండవలసిన యవసరము మీకింక లేదు. ఓయీ! తండ్రీ! ఎంతదుర్మార్గపుఁ బని జేసితివోయీ! తల్లిదండ్రులకు వన్నెఁ దెచ్చెదునాయీ దేహము నేడగ్ని హోత్రంబున బడవలసిన దేనా! ఏమే మోహమంచి రేఖ లున్నవనియును దీర్ఘాయుష్మంతురాలు వగదువనియు ను, సాముద్రికులఁ చెప్పిరే! కాని నాసాహసమిటువంటిదని తల్లిదండ్రు లతో నొక్కరును జెప్పలేదు. తల్లీ! ప్రకృతిసుకుమారములై పరను మంజుళములైన యీహస్తములతోఁ జేయునమస్కారములనుఁ గైకొ నుము. నవమాసములు మోసి నానాకష్టములఁజెంది నన్నుఁబెంచి తుదకు నగ్నిపాలుజేయుచుంటివా! చలిచీమనైనను బుద్ధిపూర్వకముగ ద్రొక్కియెఱుఁగని యీనాపాదములు అగ్నినెట్లు కాలునోగదా! తండ్రీ! ఆటలకుఁ బోవనొకరోజు సాయంకాలము కాలిలో ముల్లుగుచ్చు కొని నారాత్రిబాధఁ జెందుచుండ నీవు బలుమాఱువచ్చి వోదార్చినా వుకాదు. అంతప్రేమ నే డేమిచేసెదవు. ఎంత పాపము తటస్థించెను గదా! కడుపారఁగన్నతండ్రివి. మహాభాగుఁడవు. వృద్ధుఁడవు. అట్టినీవే కన్నకుమార్తెమాట త్రోసిపైచితివికదా! ఇఁక లోకులుపాటిం తురా! ఓతల్లీ! నాకడసారిమాటవినుము.

తే. గీ. తండ్రికినిఁ గష్టమును గూర్పఁ దలఁచినట్టి
తండ్రిద్రవ్యంబు హెచ్చింపఁ దలఁచినట్టి
న్యాయమార్గంబుఁ జూడని నాదు పేరి
తనయ నీకింక లేదను కొనవె తల్లి.

కన్నకూతురు కాటిలోఁ గలసి పోవుచున్నదని తలఁచు కొనవలదు. (భయానకముతో) ఆహా! నాబ్రతు కింకేమున్నది. మిడిగుడ్లతోడను, నలుపై భయంకరములగు నాకారములతోడను గత్తులఁ జేతంబూని యెవ్వరో వికృత రూపు లిద్దఱిటకు వచ్చుచున్నారు. ఆహా! యమకింకర దర్శనము గూడా యయినది. రోఁటనుఁ దలఁదూర్చి రోకలిపోటుకు వెఱవనేల! తల్లిదండ్రులారా! నేఁడింక జచ్చుచున్నాను. చెల్లీ! నీకొక నమస్కారము. నావలె నీవుగూడ చరించెదవని నాదృఢాభిప్రాయము. ఓభగవంతుఁడా! ఇఁక రెండు నిముసములు మాత్రము నాకు సెలవొసంగుము. కొంచెము నీ ప్రార్థనము చేసికొందును. ఓసూర్యభగవానుఁడా! నమస్కారము. ఓ తల్లిదండ్రులారా! మీకు నమస్కారములు ఆహా! మిమ్ములను గష్టపెట్టి పెండ్లి యాడుటకంటె చచ్చుటయే శ్రేయము. కాని మీ ముద్దుల పుత్రిక నేటితో మీ ఋణముఁ దీర్చుకొనుచున్నయది. తండ్రీ! నీయాజ్ఞ దాటలేక పోతినిగదా! ధనమును వ్యయముచేసి వీధులవెంబడించుట శ్రేయముకాదు. లోకులు కాకులువంటివారు. సంఘ సంస్కర్తవగు నీవే యిట్లొనరించిన యితరులు చేయుట లెక్కయా! కాఁబట్టి నీగౌరవము గాపాడుటకయి నేనిట్లొనరించితిని. తల్లీ! నీదుఃఖమును దిగమ్రింగుము. సహోదరీ! నావలె నీవు తల్లిదండ్రులను గష్టపెట్టవలదు. నాప్రతిజ్ఞ నెరవేర్చుము. సంఘసంస్కర్తలారా! చాలు మీసాహసములు చేయఁదలఁచిన కార్యము చిన్నమెత్తు లేదు. వలమీకీ వట్టుదలలు. అందుచేతనే కాలమంతయు

నన్యాయమార్గమున నడచుచున్నది. తలకు మించిన కార్యమునుతలఁ పరాదు. ఓయుత్తమ స్త్రీలారా! నావలెను మీరు తల్లిదండ్రులను గష్టపెట్టక సౌఖ్యమందుఁడు. కట్నములలో సంగఁబోకుము. ఓవిద్యార్థులారా! మీకేల లజ్జలేదు. తల్లిదండ్రుల గర్భవాసమున జనించి పరుల నేడ్పించి వేలకొలఁది కట్నములేల లాగెదరు. వారికి గష్టముండదా! స్థలభాండ విసర్జనమైన పిమ్మట జననీ జనకులు దుఃఖసాగరమున దొర్లరా! సర్వమమ్మించి మీరేలసాఁకెదరు. మంచిమార్గమున ప్రవర్తిలుఁడు. ఓ! దొడ్డిలోఁ బెఱుగు చేమంతులారా! నా చేమోడ్పులు గైకొనుఁడు. ఓభగవతీ! నీకొక నమస్కారము. భారతీ వందనములు. ఓపరాత్పరుఁడా! నీలో నన్నుఁ గలుపుకొనుము. నిశ్చింతగ నీపదధ్యానముతోఁ బ్రాణములను విడుచుచున్నాను. అగ్నులారా! ఇఁకఁ బ్రజ్వరిల్లుఁడు. మోహమా! నాదరినుండి తొలఁగుము. భయమా! నాకడనుండకుము. పిఱికితనమా! నా దేహమునుండి పాఱిపొమ్ము, క్రోధమా! నాకోసము కొట్లాడకుము. మానమా! మంజులత వహించుము. సూర్యచంద్రతారాసమూహములారా! నన్నుఁ బరీక్షించుఁడు. వాయుభట్టారకా! నీవగ్గిని బ్రవేశించి పెంచి నాదేహమును గ్రహించుకొనుము. (తెఱలేచును అగ్నిమంటలు కనఁబడును) ఓఅగ్నిదేవుఁడా నాదేహమును దహింపుము. (అని అగ్నిలోఁ బడును తెరవ్రాలును)





# వరవిక్రయము

## షష్ఠాంకము



### 1 వ రంగము.

ప్రవేశము—గృహము. సుందర శివరావు.

(చాపపైన నీలాంబరి శవము పడియుండును.)

[గుణవతి—ప్రవేశము.]

గుణ—ఆహా! ఎంత ఘోరము జరిగినది. ఇంత సాహసము చేయుదువని కలనైనను దలఁచి యుండలేదు. నాథా! నాబ్రతుకుబండలు కాను. ఇఁక నాజీవన మెందుకు ?

సీ. పెంచినారము మేము । పిల్లనుముద్దుగా
చేయించినారము । చిన్నినగలు
సంస్కృతాంధ్రంబు లాఁ । జక్కగా నేర్చెను
పాఠశాలకు మేము । పంపినాము
తండ్రిమాటకు జవ । దాట లేదెన్నఁడు
సత్యమే పల్కును । సతముఁజూడ
ఇంటిలోఁ బనులెల్ల । నింపుగాఁ జేయును
దైవభక్తిని జూపు । భావమందు

తే. గీ. పట్టుదల లేదు చెల్లిని భక్తితోడ
జూచు గురువులఁ బూజించు సొంపు మెఱయ
అట్టి నా పుత్రి బంగారు పుట్టనేడు
ప్రాణములు బాసె మేమింక బ్రతుక లేము.

సుంద—అయ్యో! ఇంత పట్టుదల నీకు గూడునా! శశితారార్థము నీబాధ మమ్ములను నల్పుచునే యుండును. ఇంత యోజన నీకుండినట్లు మాకుఁ దెలియునేని నాయత్నము మాని వేరొకనికి నిచ్చి పెండ్లి చేయక పోదునా! అమ్మాయీ! అడవిని బెట్టి మమ్ములను బాసిపోతివా!

మ. తనయా! నీకిది భావ్యమా, భువిని మా తాపితృలన్ వీడిజీ
వనముల్ బాసితి వీవు దుఃఖమున భావంబంతదొర్లాడగా
గనలేకింతయు మోసపోతిమికదా కర్మానుసారంబు ధా
త్రిని మేమెంతయు మెల్లగా వలసె పుత్రీకష్టముల్ బెట్టితే.

శా. నీవే ముద్దుల బిడ్డవంచును జనా నీకంబుతోఁ జెప్పుచున్
భావంబందున ప్రేమతోఁ గనుచుఁ సంభావించుచున్ నిత్యమున్
సేవల్ జేసి సువర్ణ డోలికలనిన్ జెల్వారగా నూపినా
జీవంబంతయు వ్యర్థమయ్యె కదల క్ష్మావ్రాతమింకేలనే
మాకింకేమిగతి చెప్పితివి తల్లీ!

గుణ—(గుండెలు బాదుకొనుచు) కట్టా! మ్మా కాపురమంతయు వార్థిని మునిఁగిపోవుచుండెనా?

సీ. నవమాసములు మోసి నానావిధంబుల
ప్రేమచే పెంచిన బిడ్డపోయె
విద్యావిశేషంబు వింతగా నేర్పిన
కన్నపుత్రిక నేడు కాలిపోయె

నాటపాటలనైన నన్నృతంబాడని
ముద్దుకూఁతురు నేఁడు బూదియయ్యె
సర్వజీవములందు సమమైన దయతోడ
మనలుమాకూఁతురు మగ్గిపోయె

గీ. సతతముహరినామ కీర్తన సల్పుచుండు
సోదరీ మణిభావంబు జూచుదయను
అట్టి మాకన్నపుత్రిక మట్టియయ్యె,
దైవమా! యిట్లొనర్పఁగఁ దగున నీకు

కనకాంబ (యేడ్చుచుఁ బ్రవేశించును) అక్కా! నన్నేమి చేయఁదలంచితివి.

సీ. అక్క నీవును నేను నరమర లేకుండ
చిన్నటినుండియు పెరిఁగినాము
ఒక కంచమునఁ దిని ఒక మంచమందున
ముద్దుగా నిద్దుర పోయినాము
ఒకచోట నాడుచు నొకచోట బాడుచు
హాయిగా నుంటిమి అమలచరిత
ఒక్కగురుని యొద్ద చక్కఁగ విద్యలు
కూర్పుని నిత్యము నేర్చినాము

తే. గీ. కట్నములు గోరు కాంతుని కలలోనైన
పెండ్లియాడ ననుచు వొట్టు బెట్టినావు
నాడు మాటలు మనసున నాటియుండె
నన్ను విడనాడి పోతివే కన్నయప్ప.

కట్టా! నీవిట్టి దురన్యాయముఁ జేయుట పాడి కాదు. కాని నీవ్రతము నేను భంగముచేయను. మనము కలసి మెలఁసి యున్న స్నేహము కాలిపోయెనదని మిక్కిలి దుఃఖించుచుంటిని.

సుందర—అమ్మాయీ! యూరకొనుము.

గుణ—అయ్యో! ఇంకేమి యూరకొనుట. కన్నకూఁతురు కాటిలోఁ గలసిపోయినది కదా! హా! కూఁతురా. దయాళువైన మమ్ము విడనాడి నీవేల ప్రాణత్యాగము చేసికొంటివి తల్లీ! తరచు శ్రీమన్నారాయణ ధ్యానమున బైకెత్తఁబడు నీచేతులు అగ్గిని బడియెట్లు మ్రగ్గినవి. హా! పుత్రీ! గృహములో నీవు పని చేయునప్పుడు నీకరములకు బాధ కలుగునేమో యని భయపడి మాన్పించుచుంటినే అట్టి నీ చేతులు నేఁడెట్లు తగులఁబడినవమ్మా! నీచేతిలో మంచిరేఖలున్నవనియును దీర్ఘాయుష్మంతురాలవనియును సాముద్రికులు చెప్పిరే. కాని యిట్టి దుర్దశ తటస్థించునని యొక్కఁడు చెప్పలేదు. అయ్యయ్యో! నేనెట్లు యీబాధ భరింపఁగలను. ఆహా! నీమీఁదనే ప్రాణములుంచి నీవే మాకుమారుఁడవనియు, కులదీపికవనియు నెంచియుంటిమే! అట్టియాశలన్నియు నేఁడు నిరాశ చేసితివా! మేమీ వివాహము తలపెట్టకుండిన నీకీ దురవస్థ తటస్థించి యుండదు కదా! ఆత్మహత్య ఘోరపాపమని పెద్దలు చెప్పుదురుకదా! అట్టిపని నీవెట్లు జేసియుంటివి పుత్రీ!

సుందర—విచారించిన లాభమెంతమాత్రము లేదు.

కనకా—అయ్యో! నాయనా! నేనిఁక జీవమందజాల. నిత్యము నాతోడనే కలసి మెలసి యుండు నా యక్క చనిపోయిన పిమ్మట నేను మాత్రమిఁక జీవించు టెందుకు,

గుణ—నాకరములందును, నాయొడియందు నుంచి యింతవఱకుఁ బెంచుకొన్న నాకుమారికను నన్నుండి వేఱుచేసి దూరమున నుంచిన ఓ! దైవమా! అగ్నిలోఁ గలసిన నాకూఁతురను ప్రేమార కౌఁగిలించుకొన నియ్యక జేసితివి కదా! ఓభగవానుఁడా! మేము చేసిన మహాపాపమేమి! మాయందుఁగల ఘోరము లెవ్వి! అయ్యో! ముద్దుల బిడ్డను మొద్దులు చేసితివే!



తే. గీ. దాని చక్కఁదనము దాని దైవభక్తి
దాని గురుసేవ వైరాగ్య మును నిరతము
గనుచు హర్షించి యుంటిమి కలలొనైన
మఱువ శక్యమె మాబిడ్డ మహిని జాడ
ఇంక మేమెట్లు బ్రతుకఁగలము.

కనకా—అక్కా! నాపైనఁగలుగు మక్కువంతయు నేమి చేసి పోతివి. అయ్యయ్యో! ప్రకృతకాల స్థితి ననుసరించి యనుబదేఁడుల లోఁ దీరవలసిన బాల్యయావన, కౌమారవార్ధకములు నీకుఁబదమూఁడవ యేటనే తీఱిపోయెనా! ఓయక్కా! నేనింక సహింపలేను.

సుందర—అయ్యో! పుత్రికా! మాముద్దు నీవు గడుపుదువను కొంటినమ్మా! ఆటలాడి యాడి యింటికివచ్చి కాళ్లునొప్పులనుచు మూల్గుచు పరుండిన యెడల లేనిపోని యాందోళనమును మనసునఁ బెట్టుకొని నీకై తపియించిన నేను నీబలవన్మరణముఁ జూచి భరించఁగలనా! ఈనీలాపనిందకు మేమోర్వఁగలమా! యీయకారణమరణము నీకేల సంభవించెనమ్మా! పుత్రీ! కడుపారఁ గన్నతండ్రిని, కాలయినను నేల మోపనీయక పెంచితినే! అట్టి నీవీయగ్నిఁబడి చచ్చుట చూచిసహించఁగలనా! చలిచీమనైనబుద్ధిపూర్వకముగఁద్రొక్కియెఱుఁగని యీ నీచరణములు నాపుత్రీ! మొదలంట కాల్పఁబడెనా! ఆహా! నావంటి మూఢుఁడులేఁడు. నీయభీష్టముఁ దెలిసికొనలేక పోతినికదా!

(పోలీసు బంట్రోతు ప్రవేశించి)

బం—అయ్యా! సుందర శివరావుగారూ! మీయింట నిన్నను కూనీ జరిగినదఁట. నిజమేనా?

సుందర—నిజమే! అదిగో శవము (శవముఁజూపించును) పంచాయితీ చేయువలయునా. అకటా! ఇదియొక దురవస్థ తటస్థించెను కదా!

బం—శవాన్ని చూచి రిపోర్టు చేసి తరువాత పంచాయితీ చేస్తాం.

సుందర—మీయాజ్ఞానుసారంబుచేయుఁడు.

బం—పోలీసు స్టేషనుకు రండి. యావత్తుసంగతి విచారించి పిమ్మట పంచాయితీ చేస్తాము. మీరు రిపోర్టు యావత్తు చేయవలెను.

(అని నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

షష్ఠాంకము:— 2 వ రంగము.

(ప్రదేశము.—లింగయ్యగారి వ్యవహారపుగది.)

లింగ—(ప్రవేశించి) ఆహా! ఎంత ఘోరము. ఎంతదుర్మార్గము. ఆపిల్ల చనిపోయినందుకు నాకేమియు విచారములేదు. కాని తిరిగి మా కుర్రవానికి కట్నము నిచ్చినపది వేలరూపాయలు వారికి ముట్టచెప్పుటకు దుఃఖమువచ్చుచున్నది. ఆహా! నావిచార మెవరావగలరు. పదులు వందలు కావుగదా! వేలకు వేలు సమర్పించవలయును.

మ॥ అకటా! ఒక్కటిగాదు నేవిడువ సాధ్యంబే మహింజాడఁగా
సకలద్రవ్యముఁ బాయఁగావలయునీ సంసారమున్ వీడి నే
నిఁక నెందైన వశింప నొప్పుకొనెదన్ యీవిత్తమున్ బాయ న
య్యకలంకాత్ముని సాక్షిగాఁబలికెదన్ ఆర్వేలనియ్యాగినిన్.

మఱియు—

తే॥ గీ॥ ప్రాణమైనను బాయఁగా భార్యమాను
సుతులభార్యను వీడఁగా సొంపుగలుగు
ద్రవ్యమును మాత్రమింతేని ధాత్రియందు
పాయనెంచిన సౌఖ్యంబు పట్టదెపుడు.

సీ॥ అదియే సేమాయు సేమామున్ బెనిచె, భార్యంబిడ్డలన్ దెచ్చె, న
య్యదియే స్వర్గము పాలితమున్ సుఖము భార్యా కాశముల్
చంద్రుండున్
అదియే భాస్కరుండున్ మహామహుండు నా యంభోనిధుల్
దేవుండున్

అదియేచూడంగ నీత్రిలోకముల భార్యా దేవతా శక్తియున్

ఛీ! ఛీ! ఆపిల్ల నన్నెంతపని చేసినది. కాని శాస్త్రసమయము నుకనిపెట్టి చన్నీ చాలా బాగుండును. ఋణ మున్నల్లు వద్దాక వచ్చినాతీరి పోను, ఎట్టిధనము వారికివ్వగూడదో ప్లీడరుతో నాలోచించవలయును. ఇవంతసమయము జూడలేకపోయినదికద్దా! ఈగోలంతయు నెవరు పడతారు. చాలు చాలు సంకటం బాగాఁగుదిర్చినది. సాధనలక్ష్మీ! నీవభివృద్ధి నొందవలసిన దే. కాని నిన్ను మాత్రము నాజీవనమున్నంతవఱకు పోనీయను.

బసవయ్య శాస్త్రి ప్రవేశించును.

బస—నాయనా! యేమాలోచించుచున్నావు. నిన్ను గుఱించి పత్రికలలో నెంత రమ్యముగా ప్రకటించినారో చూచితివా?

లింగ—నేనొకరిని తిట్టితినా! కొట్టితినా! నావిషయములు పత్రికలలో ప్రకటించుటెందుకు. అని భాగ్యుఁడెవఁడు.

బస—నిన్నొక్కనిగురించియే కాదు. ఆపిల్ల బలవన్మరణమునకు నీవే కారణభూతుఁడవఁట. ఆపిల్ల వ్రాసినయుత్తరము నిందులోఁ బ్రకటించినారు చూడుము. (అని పత్రికను చూపును.)

లింగ—ప్రకటించి నన్నేమిచేయఁగలరు. పాకిముండాకొడుకులు. నాకేమిభయం యీధాంధూములు నావద్దపనికిరావు. నేనెవరినో తెలియునా!

బస—"మొండికెత్తినబండ వానిని రాజయినను చేయలేడు"

అలాగున అన్నింటికిని తెగించిన నిన్నేమిచేయఁగలరు: చాలు చాలు నీమర్యాద.

శా॥ పున్నెంబా ! యొకయింతలేదు ధనమా ? పూర్వంబులేదింతనీ
వెన్నండైనను హాయిగాదినుటయున్ ? యిష్టానుసారంబుగా
నున్నావంచు నెఱింగియుండజనులీ ? యుర్వీతలంబందునన్
మన్నింపంగఁదలంతురే వినుము నీ ? మర్యాఁద గాపాడుమా !

లింగ—ఓరీ ! గాడిదా! నీవు నాకు జెప్పుట; నేవినుటయునా; చాలు చాలు సంతసించితిని. నోరుమూయుము, ఆపిల్లవయిని నీకింత యభిమానముఁగలిగినది ! ఇంకా పెండ్లిలేదు పెటాకులు లేదు. ఇవియా నీశ్రీరంగనీతులు.

బస—నాశ్రీరంగనీతులకేమికాని, నీనీతులకు లోకమంతయు దూషించుచున్నారులే—నీలోభత్వము మాని హాయిగానుండుము.

తే॥గీ॥ తనువుకాల్చిన వెంటనే ? ధనమురాదు
కూడఁబెట్టి తుదకు దొంగ ? కొడుకు పాలు
జేయుఁబోకుమా మానుమా ? చేష్టలిపుడు
యశముఁగాంచుము లోకంబు ? నందునీవు.

లింగ—చాలింకనోరు మూయుము.

బస—నీవింకేమి యనుకున్నను సరే కట్నముమాత్రము నా కక్కఱలేదు.

లింగ—ఓరి, నాకొంపముంచకురా ! ఆమాటలనకురా ! నా పరువునిల్పరా !

బస—నాయభీష్టప్రకారము నడువుము.

లింగ—నీవులోనికిఁ బొమ్ము. ఇంకనోరెత్తకు. ఎన్నిమర్యాదము లు జెప్పినా బుద్ధిలేదు.

అంకయ్య ప్రవేశించును.

అంక — శాస్త్రిగారూ! అబ్బాయిని కోపపడుచున్నారేమిటి?

లింగ — ఏమిచెప్పను. నాబ్రతుకంతా యిలాగున్నది. అంతా వ్యయమేకదా! (కొడుకుతో) అబ్బాయీ! లోపలకుఁబొమ్ము.

బస — నిష్క్రమించును.)

లింగ — యీరోజులలో కుఱ్ఱవాళ్లు కారండి, అల్లరిమూఁడాకొడుకులుకదా! చెప్పినమాట వినరుకదా!

అంక — లింగయ్యగారూ! సుందరశివరావుగారిచ్చిన సొమ్ము వారికి తిరిగి వప్పగించవలెనుగదా! ఆమాటనాకేమిచెప్పినారు.

లింగ — అయ్యో! అయ్యో! నాకొంపముంచావే యీమాట నీవద్దవారన్నారాయేమిటి?

అంక — (తనలో) ఆహా! మంచి సమయందొరికినది. ఇప్పుడు బెదిరించి యేమయినాలాగవలయును. లేదా నాకొంపగూడా నదిలోఁ బెట్టాలి. (ప్రకాశముగా) బాబూ! నిన్ననే నాతోఁ జెప్పినారు. కొన్ని కారణాంతరములచే మీదర్శనముచేయలేదు.

లింగ — అయ్యా! శాస్త్రిగారూ! మనది పూర్వస్నేహముగదా! మీరేదో సర్ది చెప్పవలయును. ఈవ్యవహారములో పనిచేసిపెట్టితే నీమేలుమఱువను. నీయిష్టానుసారము సొమ్ము సప్లయిచేస్తాను. శాస్త్రిగారూ! నాబ్రదుకు చూస్తూయున్నారుకదా!

మ॥ వెనుకన్ గోయియుముందుబావియయి పాపిష్టింపఁజే గదా కష్టముల్
తనయుండా వినఁడయ్యో మాటలు దరిద్ర దారిదేవత శాంతమున్
దనువుఁ జేరుచు బాధపెట్టెంపుఁ గ్రద్ధాత్రీతలంబందునన్
ధనమూపోవుచునుండెఁ దోఁచదిఁక నిద్రాహారముల్ లేవుగా!

అంక — లింగయ్యగారూ! బాధచేత మరణించకండి! మీకంతయునుపకారము చేస్తాను.

లింగ—అయ్యా ! నాకదియే కావలయును.

అంక—మీయిష్టానుసారము చేస్తాను. వారికొకదమ్మిడీకూడా మీరీయకుండఁ జేస్తాను. నాకేమిదయచేస్తారు,

లింగ—మామూలుప్రకారం

అంక—అట్లాగతే ! నాయాలోచనవినండి.

లింగ—సెలవియ్యండి.

అంక—సుందరశివరావుగారి రెండవకుమార్తెకు పదివత్సరము లున్నవి. ఆపిల్లను అబ్బాయికి వివాహముచేసికొనండి. మీరు తిరిగి ధనము దమ్మిడీనీయనక్కఱలేదు, ఆవ్యాపారమంతా నేను రైటు చేస్తాను.

లింగ—(సంతోషముతో) ఆహా ! శాస్త్రిగారూ ! మీకనేక వందనములు. మంచివాఁడవునాయనా! నీపేరుచెప్పుకొని బ్రతుకుతాను.

అంక—లింగయ్యగారూ ! నేను వెళ్లి అన్నీమాటాడుకొని వస్తాను. వ్యాపారం అంతా రైటు చేస్తాను.

లింగ—బాబూ ! నీయిష్టం. నీయాజ్ఞానుసారముగా నడుస్తాను. పాలనుముంచినా నీరమునముంచినా నీదేభారము,

అంక—పరవాలేదు. నేను వెళ్లి వస్తాను.

(అని ఇద్దఱు· నిష్క్రమింతురు.)

మూఁడవరంగము.

సుందరశివరావుగారి యిల్లు.

(కనకాంబ, సుందరశివరావు, గుణవతి, అంకయ్య ప్రవేశింతురు.)

గుణ—అంకయ్యగారూ ! ఎన్నివిధముల మఱచిపోవుమన్నను మరపురాకున్నదే. ఆహా ! పిల్లా! నీయందమేమనిచెప్పను,

చ॥ కనుబొమలున్ గనంగవలు ॥ కంజపదంబులు మోవిశీవియుర్
దనువులతల్ గరంబులును ॥ దంతములందము మోముచందమున్
వినయవిధేయతల్ మహిని ॥ విప్రుల సేవలుజూచి మేముధా
త్రినిమయువంగ శక్యమె? సు ॥ ధీమణి! చెప్పుమ! మాకుమారికన్.

సుందర—అయ్యయ్యో! మాపుత్రికను మేమెట్లు వ్రాయగలము. ఆహా! నామాట కెదురాడలేదుకదా! ఆహా! ఆమాటలయం దెంతమృదుత్వము కలదో! యూహలయందంతజ్ఞానముకలదు ఏమని విచారించము. ఎంతవిచారించిన లాభమున్నదా! ఆహా! అడవిలో దేవాలయము క్రిందనయిపోయినది.

అంక—అయ్యా! సుందరశివరావుగారూ! మీరెంతవిచారించినను సుంతయు లాభములేదు. ఊరక వెంగటిల్లుటయే కాని కలసి వచ్చినది లేదు.

సుందర—అయ్యా శాస్త్రిగారూ! ధనమూపోయెను. మాన్యమూ! విక్రయించితిని. అన్ని విధాల చెడిపోతిమిగదా!

అంక—మీరు విచారించకండి. పోయినపిల్ల రాదు. డబ్బువచ్చు యోచన చెప్పెదను లెండి. గతించినవాటికి వంగారేల?

సుందర—బాబూ! ఏమియాలోచన చెప్పెదరో నానష్టము తీర్చుదురూ!

అంక—పంతులుగారూ! చిన్నమ్మాయికి వివాహము చేయవలయునుగదా! యీపిల్లనెవరికైన నిచ్చునపుడు కట్నమీయవలయును కదా! యీఅమ్మాయిని వారికియిచ్చివేస్తిరా తిరిగికట్నమీయ నక్కఱలేదు, అదేమనకు చాలా లాభము.

సుందర—అయ్యా! నేనందులకొప్పుకొన్నను అమ్మాయి యిష్టముగాని నాయిష్టముగాదు.

అంక—అమ్మాయీ! నీయిష్టమేమి?

కనకాం—మాతల్లిదండ్రుల యభిప్రాయ మేదియో నాదికూడ నదియే.

సుందర—అంకయ్యా! మాఅమ్మాయి మాటకు జవదాటను.

కనకాం—అయ్యా: శాస్త్రిగారూ! పెద్దలయిష్టానుసారంబునకు వ్యతిరేకింపఁజాలను.

అంక—బాగుగా నాలోచించితివా?

కనకాం—తప్పక పెండ్లి యాడెదను.

సుందర—అంకయ్యగారూ! మాఅమ్మాయి అంగీకరించినది. కావున సంబంధము చక్కఁజేయుఁడు.

అంక—సరే! నేను పోయి యావత్తు సిద్ధపరిచెదను. మీరంతయు బాగుగాచేయుఁడు.

(కనకాంబ తప్ప అందఱు నిష్క్రమింతురు)

కనకాం—అక్కా! నీమతమునకు వడ్డగాజనుచున్నాను. కాబట్టినాయందనుగ్రహింపుము. ఎందుకంటివా? ఈసంఘదురాచారవిషయమయి లోకమునకుబుద్ధిగలుగఁజేసెదను. కానినీయందెంత మాత్రము నాకనిష్టతలేదు. అంతయు నీకసిదీర్చుకొనుటకే యిట్లుచేయుచున్నాను. అంతయు నీకిష్టానుసారంబుగా జేసెదను. నాయొక్క యంతరంగమే నీయంతరంగము. కావున సంఘదురాచారమును చక్కగా చంపెదను.

(తెరవ్రాలును.)





# వరవిక్రయము

## సప్తమాంకము

### మొదటిరంగము

(ప్రదేశము లింగరాజుగారి సౌధము)

(ప్రవేశము:—లింగరాజు భద్రావతి)

లింగ—ఏమే! నిన్నను పెండ్లివారింటికి వెళ్లినావు కావఁట.

భద్రా—నగలులేకుండా విధవముండలాగున పెండ్లివారింటికి వెళ్లిన నవ్వరా? ఇంటిలో శుభకార్యమగునప్పుడుకూడా నగలు పెట్టెలోనే పెట్టుకోవలయునా? నానగలు నాకిచ్చిన నెంతందముగా నుండును.

లింగ—బాగా నేయున్నది, ఏదో తొందరపనులమీద అడావిడిగ తిరుగుచున్నాను కదా! ఆసందట్లో నీనగలు గొడవ నాకు జ్ఞాపకమా!

భద్రా—అహా! ఏమిచమత్కృతిగా మాటాడుతారు. నగలు చివఱకుయివ్వకుండ తప్పుకొనుటకా! యీసాధనములు. ఎప్పుడు

చూచినపిసినిగొట్టుతనమేకదా ! ఏమనుకొను మీభాగ్యము. నగులఁ బెట్టనా ?

చ॥ ధనమును కూడబెట్టి నిజ । దారను సోదర పోషణార్థమై
వనముల కేగుచుంటి వటు । వ్యర్థము కాదె, సుఖంబులేదు, నీ
వనితను బాధలన్ గుడిపి । వంచనఁ జేయుచునుంటివీవు నీ
ధనమును గాల్చనా తుదకు । దానుఁడవైతివి సర్వభంగులన్.

లింగ — వెఱ్ఱిదానా! ఎంతమాటాడితివి. ఈరోజులలో ముఖ్యముగా కావలసిన వస్తువేదియో నీ వెఱుఁగుదువా !

భద్రా — ఆఁ ఎఱుఁగ కేమి.—

లింగ — ఎఱిగుండియు యీలాగున మాటాడితివా ?

శా॥ తల్లిందండ్రిని గేహమున్ సుఖములన్ । ధైర్యంబులన్ ప్రాణముల్
ఇల్లాలన్ సుతులన్ విసర్జనము తా । నెంతేసియున్ జేయగాఁ
జెల్లుంగాని ధనంబుమాత్రము నుపే । క్షింపన్ మనంబందు శో
భిల్లం జేయదు వాదుమాట వినవే । బింబాధరీ మొక్కుదన్

భద్రా — ఆహా! మీవంటి కఠినమనస్కులను విధాత సృజించినందుకు నాకెంతయు శోచనీయముగానున్నది. ఓయీ బ్రహ్మా ! నీసృష్టియంతయు తప్పులతప్పకదా! సృష్టికర్తవని యేలపిల్చుకొనెదవు!

తే॥ గీ॥ త్యాగికిం ద్రవ్యమునుగూర్చ । దలచవీవు
లోభికొసఁగుదు ద్రవ్యంబు । లోటులేక
చూచుచుందువు జోగికి । సుతులనిచ్చి.
భోగికిచ్చెద జీర్ణము । రోగమిచ్చి
కాల్చుచున్నావు నీసృష్టి । కాలిపోను.

అదియునుఁగాక భూపాలుర కపుత్రసంతానము చేయుదువు.

లింగ — ఓసీముండా ! నీ కాలోకాభిరామాయణమెందుకె!

గృహకృత్యములఁ జూడవుగదా! నీవా! సృష్టికర్తను దూషించుట !

తే॥ గీ॥ ఎంత చెప్పిన నీవు యీ ♦ వంతయైన
వాదువల్కులు వినకుండ ♦ వాదములను
పెట్టుచున్నావు భర్తనొ ♦ ప్పించమనుచు
బ్రహ్మనీకు బోధించెనే ♦ వడఁతిచెపుము.

పతియేదైవమని బ్రహ్మసృష్టికదా తెల్పుచున్నది. అట్టెనన్ను దూషింపఁ దగునా! నీవంటివారికే గర్వమధికమయి ప్రాణసమానమైన పతులను నిందించుచు బరగుచున్నప్పుడు. సృష్టికర్త కిట్టివీగుట కాశ్చర్యమేమున్నది.

భద్రా—నన్ను మాటిమాటికి సాధింపక వానగలేవో నాకివ్వండి.

లింగ—ఆమాటే ఇప్పుడన వద్దని చెప్పినాను.

భద్రా—అన్నట్లు కోడలికేమి నగలుచేయించినారు?

లింగ—అబ్బా! యీ ఆడువాండ్రకీనగలు వృథాకదా! పని లేదు, పాటలేదు, క్రిందమీాద యూభరణములు తగిలించుకొని వూరికే తిరుగుతుంటారుగదా! యీరుచి యెవఁడుమప్పినాడోకదా ! ఎక్కడ చూచిన నిదేగోల.

భద్రా—అయ్యో! మీారు పడేగోలింతాయంతనా ! కావలశినంతయున్నది పాపము.

లింగ—దానికేమిగాని. చెప్పవచ్చిన మాటలుపూర్తిగా మఱచినాను. మనకు రావలసిన అయిదురోజులసామగ్రి జాగ్రత్తపరచియుంచవలెను.

భద్రా—ఏమిసామగ్రి ?

లింగ—వెఱ్ఱిమొగమా! నేను చెప్పవలయునా, అప్పడములు, వడియములు, పోపుసామానులు, బియ్యము, నేయి, నూనె, అరిసెలు, మినుపపున్ని మొదలయినవి.

భద్రా—జాగ్రత్తగా నుంచుటెందుకు?

లింగ—మనబజారులో వేలం వేయించుటకు.

భద్రా—ఆహా! ఎంతపనిచేయుచున్నారు. పదిమందివిన్న ఛీ, ఛీ, యని మనమీఁదవూస్తారు.

లింగ—అలాచేస్తే డొక్కచీల్చించి డోలుకట్టిస్తాను. ఎవరు సొమ్ము అమ్మినానని అల్లాగంటారు. మొన్నసోమయాజుల నూరయ్యగారు అమ్మించలేదూ! సరే! నామాటలన్నీ విన్నావుకదా! అలాగున చేయుము. నగలు నీకొసకిస్తాను. (అని ఇద్దఱు నిష్క్రమింతురు)

(2 వ రంగము. సుందరశివరావుగారు ప్రవేశించును)

(స్థలం పెండ్లిపందిరి)

సుంద—ఈరోజులలో నయిదురోజుల పెండ్లిచేయుటకంటె రాజసూయయాగము చేయుట రవంతసులభము. రామ.రామ. పెందలకడె భోజనమునకురమ్మన్న యిప్పుడాకలిలేదనియు నాలస్యముగా పిలిచారనియు, కాఫీత్రాగినామనియు, కడుపునొప్పిగా నున్నదనియుఁ, జెప్పువారేకాని త్వరగా భోజనమునకు వచ్చువాఁడొకఁడు లేడు. ఈరోజులలో దురలవాటు ప్రారంభమయినది. కాఫీలు, ఉపమాలు, యిడ్డెనలు, పెసరట్లు, దోసెలు, ఇవన్నియు నుదయముకాఁగానే పెండ్లివారికి పంపవలయునఁట.

(అంకయ్య ప్రవేశించును)

అంక—సుందరశివరావుగారూ! నమస్కారములు. అంతా బాగానే జరిగింది. కాని, లింగయ్యగారు సదస్యము బాగాచేయలేదు.

అందఱు అలోమని యేడ్చువారు. అర్ధణాకంటె నెక్కువసంభావనయివ్వ లేదు. పోలీసువారిని పందిరిచుట్టూ పెట్టించినారుకదా!

సుందర—శాస్త్రీ! వివాహము సలక్షణముగ జేయుట యీరోజులలో మహాకష్టము.

అంక—అవునండి! బహుకష్టం. నిన్న వియ్యపురాలికిచ్చు లాంఛనములలో కొంత తగ్గినదట. అందువిషయమయి పేచీపెట్టారు. నిన్నరాత్రి పెండ్లివారి నాక్షేపించినారట. అదొకతగవు. వంటలు బాగావండలేదట. ఈసంగతి పెండ్లికొడుకు సవతిమేనమామ భార్యా చెల్లెలు అన్నదంట. వియ్యపురాలు లాంఛనములక్రింద సొమ్ము కొంత యిస్తానన్నారట. అదియీవేళ యిప్పించండి. పెండ్లివారు వెళ్లిపోతున్నారు.

సుందర—సరే! ఆధనమిస్తాను. లోపలకురమ్ము (తనలో) ఆహా! వివాహముచేసి చూడు, యిల్లుకట్టిచూడు అన్నమాట వ్యర్థము కాదు.

అంక—పంతులుగారూ! ఆలస్యంచేయకండి. త్వరగారండి.

(అని ఇద్దఱు నిష్క్రమించును.)





# వరవిక్రయము.

## అష్టమాంకము.

### మొదటి రంగము,

(ప్రదేశము — వెంగళి శాస్త్రిగారి సౌధము.)

వెంగ — (కుర్చీలోఁ గూర్చుండి) దిక్కుమాలిన ప్లీడరు వృత్తి. దీనిని తగలఁబెట్టా! అయిదు సంవత్సరాలఁబట్టి చేస్తూవున్నాను. చిల్లిగవ్వ చేరఁదీసి యుండలేదుకదా! మాపెద్దలు గడించిన భూములు బుట్రలు నమ్మి చదువు మాత్రం చచ్చిచెడి కొంతకొంత తగలఁబెట్టి చిట్టచివఱకుఁ బ్లీడరీ పరీక్ష ప్యాసు అయినాను. అందుకుమాత్రం మా తండ్రిగారు పట్టరాని సంతోషముతో నున్నారు. ఈవిధముగా వ్యాపారం వున్నది. పయికి బటారము లోపల లొటార మన్నట్లు ప్లీడరీకంతా డాబు సరియేకదా! అయినను యీరోజులలో డాబు సరి లేకుండా ప్లీడరీ వ్యాపారం సాగదుగదా. కేసులున్నను లేకపోయినను వేషం తప్పదు. పదిగంటలయేసరికి నెత్తికి పాగా తగిలించి కోటు నెక్టాయి వగయిరా సామానులతో ముస్తీబయి కోర్టుకు కుక్కలాగున పోవలయును కదా! కచేరి సావిడి డాబుసరిగా లేకపోతే పార్టీ గుమ్మం పయికి రాదు కదా. ఈరోజులలో ముఖ్యమయిన పాయింట్లు

మూాడు. కనంబడిన పార్టీతో ముచ్చటించవలయును. దర్జాగా తమాషాగా మాటలు బారులో వాగవలయును. కాఫీ హోటలకు జోరుగా బోయి ఫలహారము చేయక తప్పదు కదా! లాబుక్కులు బీరువాల నిండా వడియుండవలయును. ఎక్కడ చూచినా ప్లీడరీ బోర్డు లేకపోా! బజారులో చిల్లర దుకాణములెన్ని యున్నవో అంతకు రెండురెట్లుగా ప్లీడరీ కొంపలున్నవి. నాకీ మ్యునిసిపల్ చైరుమను పదవే లేకపోతే యీపాటికి బీరువాలు, లాపుస్తకములు, లాంకోట్లు వగయిరా చిల్లర సరుకులు విక్రయింపుకొని వీధుల వెంబడించ వలసిన మాట వాస్తవము. దీనికి వచ్చాయి అష్టకష్టాలు! క్రితంసవత్సరము వోట్లకోసం మహాతంటాలు పడ్డాను. ప్రజలను క్రిందమీాదా పెట్టి పదివేలు రూపాయిలను సంపాదించాను. ఓట్లకై వాల్గు సంచులు ఖర్చుపడ్డాయి కదా! లేకపోతే నామొగమునకా యీ చైర్మన్ పదవి. కంట్రాక్టులలో కాజేయడం సులువు. ఈసంవత్సరము ప్రజలు యిసుక తిప్పలమీాదకు నన్ను యీడిపించినంత పనిచేసినారు. అప్పుడేటరం ఆఖరు అవుచున్నది కదా! ప్రజలకు నానావిధములయిన పన్నులను విధించి అనవసరముగా జరిమానాలు వేసి యేడ్పించి వీధిలో పెట్టే సరికి వేలకొలంది వచ్చిందికదా! ఉన్నవాండ్రి కుద్యోగాలూడపీకి వయివారికిచ్చి వారివల్ల వీరివల్ల లంచాలు తింటూ తిండితిప్పలు లేక తిరిగితిరిగి కొంత సంపాదించానుకదా! ఎలక్షను రోజులు దగ్గఱ పడు తున్నాయి. పదివేలు చేతిలో బట్టుకుంటేగాని యిప్పటి స్థితి నడచే టట్లులేదు. వెనుకటి లాగేవోట్లు కొందా మంటె వీలులేదుకదా! వెఱ్ఱి వెఱ్ఱి పనులు చేస్తూయున్నానని మా ముసలాయ నూరికే సణుగుకుంటాడు. యీా యేడు యెలక్షనులో వోట్లు రాకంబోతేనోట్లో మట్టేకదా! ఇంటిలో యీపోరు. వీధిలో ఆపోరు. (పరికించి) తెలుచప్పుడగు చున్నది. ఎవరో వస్తూయున్న ట్లున్నది. (అనిలేచును.)

ఒక పౌరుడు— (నమస్కారముతో ప్రవేశించి) అయ్యా! శాస్త్రిగారూ! ఆరువేల వందనాలు. అందులో అన్నీ మీకే సుమండీ!

వెంగ—ఓయీ! వెంకన్నా! నీవటోయీ. పరాకుగానున్నాను. ఎవరో అనుకున్నాను. ఏమిటి సంగతి యీలాగున వచ్చావు.

వెంక—మొన్న మీతో మనవి చేసాను. ఆసంగతి కోసం యీలా వచ్చాను. అందు విషయమయి మీరేమి చేస్తారో యని భయపడి పరుగులిడుతూ వచ్చినాను.

వెంగ—దానికే ముందోయీ! ధనం దారి చూపించకేమి చేస్తుంది. అది ముందు. యిదివెనుక. కాబట్టి కార్యం కావలయునంటే కాసు ప్రధానముగదా! కాసు లేందే కాలు నడువదు.

వెంక—అందు విషయమయి మీరేమి ఆలోచించ వద్దు. అన్నీ నేను అనుకూలముగా జేసినాను.

వెంగ—బాగానే యున్నది. చెప్పినా కాని వినకున్నావు. పైసాలేనిదే పీనుగయినా బయిటకు పోదన్న సంగతెఱుగుదువా!

వెంక—అయ్యా! పెద్దలు రక్షించాలి.

వెంగ—వెఱ్ఱిమొగమా! రెండు దినాలనుంచి నీయింటి చుట్టూ తిరిగి సంగతంతయు జెప్పి సంచులు తీసికొని వస్తేకాని వ్యాపారం సాగదని చచ్చిచెడి చెప్పినందుకయి నామాట బత్యెపెట్టకున్నావు. కాబట్టి నీయింటిలోనుంచి నీరు వీధిలోనికి వస్తూయున్నది. దానికయి మూడు రూపాయలు ఫైను.

వెంక—అధికారులు మీరే ఆగ్రహిస్తే మేమెాగ గలమా! రక్షించండి.

వెంగ—చాకలివానచేత సావిడిలో నుంచి వీధిలోకి వెళ్ళగొట్టిస్తాను. కదలమంటే కదలవేం!

వెంక — పెద్దలు, ధర్మస్వరూపులు, అధికారులు అని అతి వినయముతో బ్రతిమాలుచుంటే మాటికి మాటికి గోటుగా తిడుతున్నావు. నీకు గర్వ మధికమయినది. బ్రతివాని గాళ్లు చేతులు పట్టుకొని రాత్రిం బవళ్లు నిద్రాహారములు లేకుండా యీచచ్చుపదవి సంపాదించినావు. ఇంతకుముందు నావోటుకోసం గోలయెత్తి నాయింటిచుట్టూ తిరిగి తగులడ్డావు కాదు. అప్పటి నాసహాయం యిప్పుడు మఱచితివా! పైసా లేకుండా పాకును పని జరగదంట. ఇవియా నీ శ్రీరంగనీతులు. ఈముష్టిపదవి యున్న మూడురోజులు మాతిమీద మానం కూడా వుంచవు కదా! అప్పుడు వోట్ల కోసం పడ్డపాట్లన్ని పరాకుపడ్డావు. ఓరిచండాలుడా! ఎంతపనిచేశావురా! అదృష్టవశాత్తూ నీకీ పదవి వచ్చిందికాని లేకబోతే ముష్టెంచోటు ముఖ్యంగా వచ్చును. ఇంతకంటె నన్నేమి చేస్తావు. నీవోటు నాకు ముఖ్యముగా యివ్వవలయును సుమండీ! అన్న అభాగ్యుడవు. యిప్పుడునామాటంటేతలఁకవు. ఈమాటు నీపని పడతావుండు. కుక్కలపాలు నక్కలుపాలు చేస్తావుండు. ముఖ్య బంధువుకదా యని మూడురోజులు నిద్రాహారములు లేకుండా నీకోసం నిప్పులు కక్కుకుంటూ కాళ్ళఱుగ దిరిగినను దయా దాక్షిణ్యం లేకుండా! యెంతమాటన్నావు! ఓట్లకోసం వూరంతా త్రిప్పినావు కాదు. ఇంత పొంగి కోర్లపడకూడదు సుమీ! నాయుసురు నీకుఁ దగులు తుండిసుమీ! ఇంక నాకు సెలవు. నేను నీదగ్గఱ నుండకూడదు. (అని నిష్క్రమించును.)

వెంగ — ఓరీ! ఎంతంతమాటలన్నావురా! నామాటంటే గ్రామమంతకుపాడలు. ఆలాటి మనిషికి యీలాటి తిప్ప లుప్పతిల్లాయి. ఈవిధవ కలంబడి కొట్టినా కాని యీలాగు మొద్దులాగుండవలసినదే! నా అధికారము అల్లునిమీదే కాని వీనిమీద చెలాయించినది కాదు.

ఇంతకూ నాకర్మం. అందఱికన్న నా అధికారం చేస్తే సాగుతుంది? వద్దమ్మమీాద దూంధాములు నిర్వహిస్తాయి. కాని గట్టివానిదగ్గఱ కర్ర పెత్తనం సాగుతుందీ! వట్టిమాట- (శరికించి) ఎవరో వస్తున్నారు.

లింగయ్య—(ప్రవేశము) పంతులుగారూ! నమస్కారములు. తీరుబడిగా కూర్చున్నారేమి?

వెంక—అయ్యా! కూర్చోండి. తీరుబడిలేదు. దిబ్బాలేదు. పార్టీలబాధలు పడలేకుండా యున్నామండీ. పదిగంటలయిందా కా యింటిలో గోల. తరువాత కోర్టులో గోల. సాయంత్రము సావిడిలో గోల. ఏమి చెప్పను. ఏమిటిబిమీాద వచ్చారు?

లింగ—(కూర్చుండి) ఏమి చెప్పను. మాఅబ్బాయిని సుందర శివరావుగారి అమ్మాయికిచ్చిన మాట మీారు తెలుసునుకదా! పెండ్లికి నాలుగువేల రూపాయల నగలుంచినాను. వివాహమై నాల్గు సంవత్స రములు కావచ్చినది. పిల్లను గాపురమునకుఁ బంపరు.

వెంక—ఇంత వెఱ్ఱి పని చేశారేమిటండి?

లింగ—ఏమిచేయునండీ. బ్రతుకీలాగయినది. వెంటనే నగలు లాగుదామని చూశాను. కాని వీలులేకఁ బోయినది. ఇప్పుడు ఆనగలు మనకు వచ్చే విధం చూడాలి.

వెంక—దాని తస్సాజండా! అదెంత సేపండీ. అరనిమిషం లో చేయువచ్చును.

లింగ—దానికోసం నోటీసు ముందువ్రాయించండి- నే సెలవు పుచ్చుకుంటాను.

వెంక—సరే. మీారు ముందు వెళ్ళండి. నేసాయంత్రం కోర్టు నుంచిరాగానే వ్రాస్తాను. ఖర్చులు క్రింద కొంతసొమ్ము జమకట్టిం

చండి. ఫీజు పీకులాట లేకుండా చూచుకుందాము, మొత్తం నూరు రూపాయలు పంపించండి. తరువాత చూచుకుందాము.

లింగయ్య—అన్నన్న. ఎంతమాట. మీరు సెలవియ్యాలా ! నాకుఁ దెలియదు? (తనలో) వీడి తస్సాగొయ్యా. డబ్బు మాటే కాని వ్రాతమాట చెప్పడు కదా ! (అని నిష్క్రమించును.)

(తెరవ్రాలును.)





# వరవిక్రయము.

## నవమాంకము



### 1 వ రంగము.

(ప్రదేశం—సుందర శివరావుగారి యిల్లు)

(కనకాంబ—సుందర శివరావు ప్రవేశించును.)

సుందర—అమ్మాయీ! నామాట వినవుకదా! పేచీలు వద్దని అనేక పర్యాయములు చెప్పినాను.

కనకా—నాయనా! మీరిందు విషయమయి యడలకుఁడు. అన్నియు నాచేతిలో నున్నవి. అన్నియు నేను చక్క చేసెదను. నోటీసు యిటు తెండు.

సుందర—ఇదిగో (అని యిచ్చును.)

కనకాంబ—(పుచ్చుకొని చదువుచుండును.)

(రిజస్టరీ నోటీసు)

| | |
|---|---|
| మహారాజశ్రీ యం. వెంగళిశాస్త్రి<br>(B. A. B. L.) బి. యే. బి. యల్.<br>హైకోర్టు వకీలు<br>వారి ఆఫీసునుండి | మహారాజశ్రీ<br>శోకాల సుందర<br>శివరావుగారికి<br>యీనాందార్లు |

నవమాంకము

మా క్లయింటున్నూ లోభికోయ్యలొల్లయ్యాగారి కుమా గయ్యాగారు మాకుయిచ్చిన సంజాయిషీ ప్రకారం మీరుఁ జేయునదేమనఁగా ?

మీకుమార్తెను అత్తవారింటికి పంపించక వస్తువులను రించవలెననే దురుద్దేశమున్నట్లున్నూ మాక్లయింటుకు తెలిసి సదరు హీలవల్లమీరు తగాయిదాను పొందుతూ యుండి కాపురమునకు పంపిస్తామని కాలయాపన చేయడమే కాని, కాపురమునకుఁ బంపుటకాని, సదరు వివాహకాలమందున పెట్టిన నగలు యిచ్చుట కాని లేదు. కాఁబట్టి యిందుమూ మీకు దెలియ, చేయునదేమనగా యీనోటీసు అందిన రెం లోగా మీ కుమార్తెను వస్తువులసహితం కాపురమునకు వస్తువులు ముట్టినట్టు మాక్లయింటు వల్ల క్రమమయిన రశీదు వలెననిన్నీ లేని యెడల మీపయినదావా క్రిమ ప్రకారం కోర్టు ఖర్చులతో సహితం రాఁబట్టుకోబడునని యిందుమూలముగా తెలియ చేయడమయినది.

చిత్తగించవలెను.
యం. వెంగళిశాస్త్రి
వకీలు. బి. యే. బి. యల్.

నాయనా! దావాచేయనియ్యఁడు. సమాధానమేమియు నియ్యతలచ.

సుంధర—దావా చేస్తే మనమేమిచేయఁగలము. అదికాకుండా; ఆడవాళ్లు కచేరీలవెంట తిరగడం మంచిపనికాదు. ధనమా? వ్యయమా, దారుఢ్యమా? తప్పెను.

కనకాం—తండ్రీ! ఎంతమాత్రం విచారించవద్దు. ఇదివరకు ధనముతోబాటు యీద్రవ్యము కూడా ఖర్చుపెట్టుము. మీరుచింతిం పకుఁడు. అన్నియునాకు తెలియును.

సుందర—నీయిష్టము తల్లీ! చిన్నపిల్లవు. కాఁబట్టి చెప్పుచుంటిని. మనవారి నలుగురినోటిలోఁ బడుట నాకిష్టము లేదు.

కనకా—ఇదివఱకుకంటె నెక్కువ కాదు. మన గ్రహస్థితి బాగుండలేదు. నీకీవిషయములో నెంతమాత్రము భయము లేదు. సర్వ విధముల భగవంతుఁడే సాయపడును. త్వరగా భోజనమునకు లెండు విచారింపకుఁడు.

సుందర—అక్కా! ఆవిధముగా నయినందుకు దుఃఖించుచుం నీవు మమ్ములను గాపాడుదువని నమ్మియుంటిమి. యీలాగు ట పాడికాదు.

కనకాం—తండ్రీ! నామాట వినుము.

(ఇరువురు నిష్క్రమింతురు)

## 2వ రంగము.

## మునసబు కోర్టు

(న్యాయాధిపతి,ప్లీడరు వెంకటశాస్త్రి, లింగయ్య,బసవయ్య శాస్త్రి-సుందరశివరావు_కనకాంబ పగయిరాలు ప్రవేశింతురు)

వెంక—అయ్యా! పార్టీలందఱు సిద్ధముగా నున్నారు. కోర్టువారు పిలిపించండి.

న్యాయా—సరే; పిలిపించెదను. రికార్డంతయు సిద్ధముగా నున్నదా? జవాను! పిలువుము.

వెంక—జవాన్, బసవయ్యశాస్త్రిని,సుందర శివరావుని పిలువుము?

జవాన్—బసవయ్యశాస్త్రి! సుందరశివరావు!

(అని ముమ్మారు పిలుచును)

బస—అయ్యా! నమస్కారములు.

వెంగ—కేసులో వాదిప్రతివాదులు సిద్ధముగా నున్నారు. విచారణ చేయించవచ్చును.

న్యాయా—వెంకటశాస్త్రిగారూ! యీ కేసు కాగితములు యావత్తు చదివిచూచితిని. రాజీనామా చేయుటమంచిదని.

వెంగ—ఇదెంతమాత్రము రాజీచేయడానికి వీలు లేదు. పూర్ణ యింటు వప్పుకొనదు.

న్యాయా—నాకు రాజీచేయుట మంచిపనియని తోచినది.

వెంగ—అయ్యా! లింగయ్యగారూ! ఇటుదయ చేయ్యండి.

లింగ—(ముందునకు వచ్చి) అయ్యా! ఏమి సెలవు?

వెంగ—యీ కేసులో రాజీపడవలయునని మునసబు చెపుతున్నారు. నీకిష్టమేనా?

లింగ—నాకిష్టము లేదు,

న్యాయా—నీ వెవరవు?

వెంగ—ఈయన పూర్ణయింటు తండ్రి.

న్యాయా—నీవు కట్నమెంత పుచ్చుకున్నావు?

వెంగ—కట్నములో పేచీలేదండీ. ఆవిషయమైన న్యాజ్యము కాదండి.

లింగ—నాకు నగలుయిప్పిస్తే చాలండి.

న్యాయా—సుందరశివరావు! నీవేమంటావు! పిల్లను కాపురమున కెందుకు పంపించినావు కావు?

సుందర—అయ్యా! నాకు ప్లీడరు లేడు. కోర్టువారిష్టప్రకారం చేయించండి.

కనకాం—అయ్యా! మీరు అధికారులు. అంతయు మీయాధీనములో నున్నది.

వెంగ—అయ్యా! యీ కేసులో ముఖ్యరాలీమే!

న్యాయా—అమ్మాయీ! నీవేమి చెప్పఁదలఁచితివో చెప్పుము?

కనకా—అయ్యా! ఇందు నా జనకుని దోషమేమియు లేదు.

న్యాయా—నీవు అత్తవారింటికి వెళ్ళెదవా?

కనకా—అయ్యా! నేను అత్తవారింటికి వెళ్ళనవసరము లేదు ఇందు చాలా అన్యాయము కలదు. అంతయు మీరాలోచించి న్యాయము దయచేయుఁడు.

లింగ—నీవు మాయింటికి రానవసరము లేదు. మానగలు మాకుఁ జాలవైచినఁ జాలు.

కనకా—నగలు మీకీయ వసరము లేదు,

న్యాయా—ఎందుచేత? వారుపెట్టిననగలు వారికియ్యవలదా?

కనకా—ఇయ్యవచ్చునుగాని, పెండ్లికాలమందు నాకిచ్చుట చేత నది స్త్రీధనమయినది. ఆది వారుతిరిగి పుచ్చుకొనుట కధికారము లేదు.

లింగ—ఆహా! ఎంతయాలోచన వృస్న దే! ఇంతకు నీవే కొంప తీసినావు.

వెంగ—అయ్యా! లింగయ్యగారూ! అల్లరిచేయకండి. నేనడుగుతాను.

లింగ—ఏమడగడమో కాని, నోటిలోనుంచి మాటర

వెంగ—అయ్యా! కలకత్తాలోఁగంపెదువాౘిసినాఁడు. మాటాడుటకు నెంతమాత్రమునధికారము లేదు. తండ్రిమి చేసినాము గనుక తండ్రి మాటాడవలయును.

న్యాయా—నేను మాటాడవచ్చునని చెప్పినాను.

లింగ—అయ్యా! నాసొమ్మంతయు నష్టమయినది.

వెంగ—అబ్బా! ఊరుకొనవయ్యా! నేను మాటాడ న్నను కానూ?

న్యాయా——అమ్మాయీ! నీవు అత్తవారింటికి యెందుకు వెళ్ళవు?

కనకా——న్యాయముగా వివాహముజరిగిన యెడల అత్తవారింటికి వెళ్ళుట భావ్యమే.

వెంగ——అయ్యా! నామాట వినండి "బాంబాయి ఫార్టీసిక్సు" లో బోర్డు వ్రాసినాఁడు. అత్తవారింటికి రానిపిల్లను కాళ్ళు చేతులు కట్టి తీసుకువెళ్లుమన్నాఁడు.

న్యాయా——అయ్యా! కొంతసేపుమీరు వూరుకొనుఁడు. యీ పిల్లంతయు చెప్పినతరువాత మీరుమాటాడండి. అమ్మాయీ! యీ పెండ్లి యెందుచేత అన్యాయము?

కనకా——అయ్యా! మీరు యీరశీదులు చూడండి. మాతండ్రి గారు పదివేలరూపాయలకు పెండ్లికుమారుని క్రియమునకుఁ దీసికొంటిరి. (అని రశీదు లిచ్చును.)

న్యాయా——(చదువును) ఆహా! ఇదంతయు చిత్రముగా నున్నది. నేనెన్నడు యీ పెండ్లిని చూడలేదు. ఈరశీదులు మీరిచ్చినవేనా? వెంగళశాస్త్రిగారూ!

వెంగ——ఇవి అన్నియు అన్యాయము. కల్పింపఁబడినవి. నా వ్రాలు కాదు. ఫోర్జరీ చేశారండి.

న్యాయా——ఆహా! ఇదంతయు పెద్దగందరగోళముగా నున్నదే. ఈరశీదులు మేము వారిచ్చినట్లు నమ్మినాము.

బసవ——(పశ్చాత్తాపముగా) అయ్యా! నాకుతోచినదియుఁ దెలిసినదియు చెప్పుచుంటిని వినండి. నాతండ్రి పదివేలరూపాయలకు నన్నమ్మినమాట వాస్తవము. నేనుపామరుఁడనై భార్యను కోర్టుకెక్కించితిని.

న్యాయా—నాతీర్పు ప్రకారము యీపిల్లవాడే చెప్పినాడు. ఇందెంతయు నబద్ధము లేదు. మీరలన్యోన్యమైత్రిగలిగి మెలఁగుడు.

బస—అయ్యా! నాయభిప్రాయమంతియే—

న్యాయా—సరే! మీరు మీయిండ్లకుఁబొండు.

(తెరవ్రాలును)

నవమాంకము

సమాప్తము.







# వరవిక్రయము

## దశమాంకము.

### మొదటి రంగము.

ప్రదేశము—రాజవీధి—(ప్రవేశము సుందరశివరావు, కనకాంబ, బసవయ్యశాస్త్రి, గుణవతి.)

సుంద— ఆహా! ఏమి! యీకలికాలవైపరీత్యము! ఓమహా జనసమూహములారా! ఇప్పటికైనను బుద్ధిగలిగి మెలంగుడు. ఏమి! మీనడవడిక లిట్టివా?

సీ. ఇల్లుమాన్యంబులు గుల్లఁజేయఁగ నెంచి
కట్నంబులనుగోరు ఖరములార
విద్యాప్రవీణత వీసంబు లేకున్న
కట్నమే తలచెడు కాకులార
పూర్వార్జితంబేని పొందుగా లేనిదే
కొసరి కట్నములాగు కుమతులార
లాంఛనంబులు మీకు లక్షగా నిచ్చిన
తృప్తితీరని పాడు తొత్తులార

గీ. భాగ్యమే యిది మీకు మీ భావమందు
కలవిధాత్రిని పూర్వంబు తలచిచూడ

కట్నముల బాధమాన్పంగ ¦ కరమునందు
ఒట్టునిడిపొందు నేడు మీ ¦ రొప్పుగాను.

జన—ఓవిద్యార్థులారా! శుల్కముల గోరు శుంఠలారా!
సంఘదురాచారములను చంపరా?

సీ. పొట్టఁగోసిన గాని ¦ పొడియక్షరం బేని
లేదుగా చూడంగ ¦ రేచులార
మస్తుగా భుజియించి ¦ దుస్తులన్ ధరియించి
బడికిబోవని భూరి ¦ బందలార
క్రాపింగుచక్కగా ¦ గత్తిరించి తిలకంబు
మోమునఁ బెట్టని ¦ మూర్ఖులార
అందమే కాని వి ¦ ద్యను కోరకుండెడి
మార్గంబుజూచు దు ¦ ర్మార్గులార

గీ. ఇన్ని బుద్ధులు గలిగి మీ ¦ రేల కట్న
ములను కోరుచుండిరి, చాలు ¦ మూఢులార
సంఘ యీదురాచారంబు ¦ సాహసించి
మాన్పగా నెంచుడీ భూరి ¦ మహినియుందు.

కన—ఓసహోదరులారా! సుశీల సమూహములారా! మీరేటికి మాతృగర్భమున కపాయగలిగించెదరు? నేటి సంఘదురాచారములు వీక్షించుట లేదా? మీశరీరమునకు నాటుటలేదా? తల్లిదండ్రులను కష్టపెట్టి మీకయి మడి మాన్యంబుల నమ్మించి వేలకు వేలు గట్నములు పోయుచున్నాను చుంటిరా? చాలు, యీపాటికి లోకజ్ఞానులయి ప్రవర్తిల్లుఁడు. మీకై నిత్యము వంతజెందు తల్లిదండ్రులను గాంచుట లేదా? కష్టానుభవంబు లేదా? ఏటికి, యీదుర్మార్గము, నామాట లేపాటి సేయుడు.

సీ. చిన్ననాటయు నుంచి ౹ ప్రేమతోఁ బెంచిగి మీ
తల్లిదండ్రుల తోడ ౹ తగవులేల?
విద్దెబుద్ధులు నేర్పి ౹ ముద్దుగాఁ జూచిన
తల్లిదండ్రుల తోడ ౹ తగవులేల?
పుట్టిన దాదిగా ౹ బూజించు మిమ్ములన్
దల్లితండ్రుల తోడ ౹ తగవులేల?
నగలు నాణెంబులు ౹ నయముగాఁ బెట్టుమీ
తల్లిదండ్రుల తోడ ౹ తగవులేల?
గీ. కట్నములు కోసి మగలతోఁ ౹ గాపురంబు
చేయుకంటె నూతనుఁబడి ౹ జీవములను
బాయుటే శ్రేయమిటు మీకుఁ ౹ బడతులార
తగవులాటలు మానుడీ ౹ ధరణియందు.

మఱియు

సీ. కట్నాలకై కొని ౹ ఖండించు మగలతోఁ
గాపురంబును జేయు ౹ కాంతలార!
తగినవేళ మనంగి ౹ దండించు భర్తతోఁ
బల్లకీలో నుండు ౹ పిల్లలార!
కాఁపుగోడుల నమ్మి ౹ కొనితెచ్చు కొన్న మ
గలతో మెలంగురో ౹ కన్నెలార!
మీ పెండ్లికై చేయు ౹ మీతండ్రి యప్పులు
చూచి యానందించు ౹ సుదతులార!
గీ. తలచి చూడంగ మీచర్య ౹ ధరణియందు
నీచకముగాదె వేఱొండు ౹ నింద లేల?

చాలు మీరింకఁ గీర్తితో ( సంచరించి
కట్నముల బాధ మాన్పుడీ ( కాలమందు.

గుణ—అకటా! ఏమి! యీకలికాలమహిమ! మగబిడ్డలం గన్నయో యొయ్యారులార!

సీ. మగవాడు పుట్టంగ ( మర్యాద లేకుండ
కట్నమే లెక్కించు ( కాంతలార!
మగలతో నిత్యంబు ( తగవులాటను బెట్టి
శుల్కమే కోరు యో ( సుదతులార!
పెండ్లిలో మధ్యన ( పేచీలఁబెట్టి లాం
ఛనములు లాగు మీ ( జారులార!
అయిదురోజులు ( పెండ్లి హాయిగా లేదని
బాధపెట్టెడి గొప్ప ( యధములార!

తే. గీ. ఆడువారలు కార! మీ ( రకట! యిటుల
పాడియే! కయ్యముల( బెట్టి ( బాధకుమప!
చాలు మీరింక మానుడీ ( సనసములను
మెలఁగి సత్కీర్తిఁ గలుగుడో ( వెలదులార!

మ. ఫలహారంబులు నిత్యమున్ మెసగినన్ ( మర్యాదతో జూచినన్
గలకోర్కెల్ దగఁదీర్చినన్ సిరులతోఁ ( గళ్యాణమున్ జేసినన్
గలవె న్నోయికలోపముల్ యనుచు నే ( కాట్లాటనో పెట్టిమీ
రిలలోఁ జేసెడి ఘోరకృత్యములు నే ( నేమంచు భాషించెదన్.

ఓ యక్కలారా! ఈయన్యాయ వర్తనము పాడికాదు. వెంటనే విస ర్జించుటయే యుక్తము.

ఒక విప్రుడు-(ప్రవేశించి) ఆర్యా! కట్నములు పుచ్చుకొనుట కంటె కాటిలోఁ గాపురముసేయుట మేలు. అందుచేత నేనాకీదిక్కు సం భవించినది.

7.

సీ. పెండ్లి కాదంచు నే ఽ పిల్లవానిని గొట్టి
పాఠశాలకు ముందు ఽ పంపినాను
యేడ్పించి కట్నంబు ఽ వేలకు వేలుగాఁ
బుచ్చుకొంటిని నేను ఽ పొందుగాను
చీటిమాటికి నేను ఽ చీవాట్లు పెట్టి గ్ర
హించినాడను పెక్కు ఽ లాంఛనములు
ఆసొమ్ముతో నేను ఽ హాయిగా సౌధంబు
కట్టించి అద్దెకి ఽ బెట్టినాను

గీ. ఇల్లు పడిపోయె చనిపోయె ఽ నింటిదిపుడు
కాలిపోయెను మంటలోఁ ఽ గన్నకొడుకు
కోడలా లేచి పోయెను ఽ కూడు లేదు
బాధపడలేను కట్నాలు ఽ వలదు వలదు.

అయ్యా! నాగొడవయింకా చాలా కలదు, ఆనక ఆలోచించుకొందాము.

ఒక కమ్మ (ప్రవేశించి) అయ్యా! నేఁజెప్పే గొడవకొంచెము వినండి?

సీ. కష్టించి కష్టించి ఽ కాయంబు చెమటూర్చి
చేర్చినాడను పెద్ద ఽ చేను లెన్నొ
కలభూములన్నియు ఽ కట్నాల క్రిందిచ్చి
పేర్మియింటఁ బిల్ల న ఽ ర్పించినాను
అందంబుగా నేను ఽ అలకపానుపు కాడ
ముట్టజెప్పితి నాదు ఽ పుట్టిభూమి
సర్వంబు తిన్నట్టి ఽ చవటుగాడిదె కొడుకు
యింటిలోఁ బిల్లని ఽ గెంటినాడు

తే. గీ. తిండియా లేదు పోషించెఁ ఽ దిక్కులెన్నొ
బిడ్డకా లేదు కట్టంగ ఽ గుడ్డయిపుడు

అల్లురకుఁ బెట్టు వాళ్లకు నను భవంబు
లివియె, కమ్మవాళ్లకు లేదు భువనికూడ,

ఒక షావుకారు (ప్రవేశించి) అయ్యా! సభాస్తారులారా! నాగోలద యచేసి వినండి.

సీ. చిల్లరకొట్టును సిగ్గులేకను బెట్టి
గడియించినాడను కానులెన్నొ
పిల్లను కట్నాల బేరంబులోఁ బెట్టి
అనుభవించెడి యిల్లు అమ్మినాను
అప్పుసొప్పులు చేసి అలకషానుపు కాడ
పదివేలు గొప్పగాఁ బంపినాను
సంగీత సభ లెన్నొ చక్కగాఁ బెట్టించి
విత్తమెల్లయు ఖర్చు పెట్టినాను
తే. గీ. పెండ్లిలో వాళ్లు తెలియక పేలినాను
గొప్పకోసము మాటలు జెప్పినాను
అప్పుతీర్చక కోర్టుకు నరిగినాడ
కట్నముల బాధమాన్పుడీ పట్నమందు.

(నిష్క్రమించును)

రామయ్య (కంగారుగా బ్రవేశించి) అయ్యా! కాంపపనినిగి పోయింది. మాయజమాని కోర్టులో వ్యాజ్యము పోయిందనే బెంగకం గారుల చేత, రోడ్డుమీదనుంచి వస్తూ బండిక్రిందపడి ప్రాణాలుబా యుటకు సిద్ధముగా నున్నారు.

సుందర—(భయముతో) అబ్బబ్బా! ఎంత ఘోరకృత్యము జరిగినది. రండు. రండు. పోయిచూద్దాము.

(అందరు నిష్క్రమింతురు.)

(తెరలేచును.)

లింగ—(రాజవీధిలో రోడ్డుమీద పడియుండి) ఛీ! యీబండి దెబ్బకు నేనంతమాత్రము విచారించను. కాని నాకొడుకుచేసిన పాడుపనికి దిగులు చెందుచున్నాను. ఆహా! నాధనమంతయు పోయెను కదా! నాకుకొడుకు పుట్టిననేమి? చచ్చిననేమి? నాకుఁ గుమారుని గుఱించి ముఖ్యముగా మతిపోయినది. ఆహా! నేను గడించిన ధనమెంత నష్టమయినది.

సీ. గుడ్డలంగట్టకఁ । గూడైన దినకుండ
చిల్లిగవ్వల నంతు । చేర్చినాను
పెచ్చునడ్డీలను । బుచ్చుకొంటిని నేను
కొత్తనోటుల నెన్ని । కూర్చినాను
దొంగపత్రంబులన్ । లొంగదీయుచు నేను
వ్రాయించి వాడను । పరులచేత
సంభావనల కేగి । సంతర్పణల కేగి
వెనకవేసితి కొంత । విత్తమేను
తే. గీ. బీదయనకుండ ముష్టిని । బెట్టకుండ
పరులకొంపల వార్పినే । బ్రబలినాను
యిట్టి దుర్మార్గ కార్యంబు । లేను జేయ
యముడు పంపెడు భటుల నీ । సమయమందు.

సుందర—(ప్రవేశించి) బావగారూ! మీకీబాధ యేలకలిగెను.

లింగ—బావగారూ! ఇదియంతయు నాకర్మము. విధివ్రాత దాటతరమా?

నే నెన్ని యపచారము లొనరించితిని. గుడ్డిగవ్వయైన ధర్మముచేయక దాచిపెట్టితిని. ఛీ! నాజన్మమెంతపాపము చేసినదో కదా? ఎందుకు

నాబ్రతుకు. భార్యయూ నిందించుచున్నది. కుమారుఁడా కోపించినాఁడు. కాఁబట్టి యీధనము నాకుమాత్రమెందుకు నాకుగౌరవములేదుకదా? కాఁబట్టి శ్రీమన్నారాయణసేవయే సతతముచేసిపుణ్యముగణింతును. (జనులనుద్దేశించి) ఆర్యులారా! సకల పుణ్యకర్మలకాకరమై పుణ్యభూమియని ప్రపంచమునఁ బేరెన్నికఁగన్న యీభారతభూమియందు ననేక సుపుత్రులుదయించి సంఘదురాచారములు మాన్పఁజాలకుండిరిగదా! నేటికినాకోడలు బయలువెడలి ప్రయత్నించుచుండెను. కాఁబట్టి నావలె మీరును సంచరించక కట్నములకొఱకయి కష్టపడకుఁడు. నేను మహాపాపిని. సంఘదురాచారమభివృద్ధిచేసిన చవటను. విప్రకులాధముఁడను. కాఁబట్టి లోకజ్ఞానము గలిగి సంఘదురాచారములు బాపి సహాయ మొనర్పుఁడు. ఇవియే నాయొక్క వందనములు.

తే॥ గీ॥ ధరణి యీతిబాధలులేక తనరుఁగాక
భార్యభర్తలన్యోన్యము బడయుఁగాక
కట్నముల బాధలేకుండ గ్రాలుఁగాక
ప్రజల నన్యోన్యవైరముల్ బాయుఁగాక
బాలకామేశ్వరీకవి ప్రబలుఁగాక.

సుందర శివరావు—తథాస్తు - తథాస్తు.

(తెరవ్రాలును)

గద్య

ఇది శ్రీరామచరణారవిందసేవనారతుండును కౌశికసగోత్రుం
డును, గరికిపాటివంశపయఃపారావారరాకాసుధాక
రుండును, పురాణపండితకామశాస్త్రి పౌత్రుం
డును, వెంకటరత్న సావిత్రీ పుత్రుండు
నగు కామేశ్వరరావు ప్రణీతం
బైన వరవిక్రయ నాట
కంబున సర్వము
సమాప్తము.



మావద్ద సాధ్యమైనంతవరకు ఆంధ్ర

దేశంబునంగల వివిధ గ్రంథకర్తలచే రచి

యింపబడి వివిధ ముద్రణాలయములలో

ప్రచురింపబడి సంస్కృతాంధ్రములలో

వేద, వైదిక, వేదాంత, జ్యోతిష, వైద్య,

ధర్మశాస్త్రంబులు, నవలలు, నాటకములు,

ఇంకను హాస్యరస పూరితమయిన పుస్తక

ములు, డ్రామాఫార్ములు మొదలగు గ్రంథ

ములు దొరుకును. ఇవి అవి అననేల

అన్నియు మావద్ద దొరుకును.

వర్తకులకు మంచిరుసుము యివ్వబడును.



# గృహవైద్య చికిత్సాసారము.

గ్రంథకర్త:—మహేశ్వర సూర్యనారాయణగారు.

వేలకువేలు విక్రియం. వెంటనే ప్రతి తెప్పించుకొనుడు.

ఈవైద్యగ్రంథము గొప్పగొప్ప విద్వాంసులచేతను పండితుల చేతను సరిచూడబడినది. ప్రతిపట్టణమందును ప్రతిపల్లెటూరునందును యిచ్చట అచ్చట అననేల ప్రతిగృహమందున ప్రథమ సహాయముగా నుండఁదగినది. వైద్యులకు, సలహాయిచ్చే పరమ రహస్యములు గలవు. మాగృహవైద్యచికిత్సాసారము పూర్వమున మాపూర్వులు సంపాదించిన తాటియాకుగ్రంథమును మేముచూచి దానిని కొంతభాగము పెంచి అచ్చొత్తించడమయినది. మావ్రాతలయథార్థము తెలుసుకొనుటకు నేడే మీరువ్రాసి ప్రతి తెప్పించుకొనుడు. వెల రు 1-0-0

# రసపుత్రవిజయము

గ్రంథకర్త:—ద్రోణంరాజు సీతారామారావుగారు

ఇది విమలాదేవి నవల ననుసరించి వ్రాయబడిన చక్కని చరిత్రాత్మకనాటకము. అనేక నాటకసమాజములవారిచే ప్రదర్శించిన కథ గావున, కథననుసరించి రాజమహేంద్రవరం "చింతామణి". నాటక సమాజము యాక్టరులగు కీర్తిశేషులైన అల్లక చంద్రశేఖరముగారిచే రచియింపఁబడిన కీర్తనలతో విరాజిల్లుచున్నది. వెల రు 1—0—0

గొల్లపూడి వీరాస్వామి-శ్రీసీతారామాబుక్ డిపో, రాజమండ్రి.

# సురానంద

(గ్రంథకర్త:—కొడాలి సత్యనారాయణరావుగారు.)

మద్యపాననిరసమును నధిక్షేపించు యాంధ్రులు గలరా ? అట్టి దానిని బ్రోత్సహించు యుద్గ్రంథము బఠించు నిష్టపడనివా రుందురా? ఇదివరలో దీనిని కారణాంతరములవల్లఁ "గల్లుముంత" యని బ్రకటించితిమి. ఇదియే సురానంద యనుపేరుతో వెలువడినది. చందాదారులకు పోస్టేజితో రు 1-0-0 మాత్రమే యగును. తదితరులకు పోస్టేజితో రు 1-4-0 లు అగును. శైలిపద్యములఁ దిలకింపుఁడు.

గీ. ఐకమత్యమె యున్న దా ♦ యాదులందు
ద్వేషమే లేక యున్న నీ ♦ దేశమునకు
జాతిమతకక్ష లేకున్న ♦ క్షణికమందు
రాకయుండునె మనకు స్వ ♦ రాజ్యపదవి ?

గీ. రాళ్ళనుఱువ్వఁబూనుట, దు ♦ రంతరులైమితిమీఱిత్రాగియుం
గళ్ళను కొల్లగొట్టుట, వి ♦ కారికనవ్వుట, దొళ్ళదోపుగ
బళ్ళను నడ్డగించుట, స్వ ♦ భావములొనటుఁజేయు త్రాగుటం
గళ్ళవిహారమెన్నఁడు జ ♦ గత్తులఁగల్గునొ భారతాంబరో? 2

గీ. మద్యమా! నీవులేని దే ♦ యుద్యమంబు
సాగఁగాఁబోదు నీదెంత ♦ సాహసంబొ
కోట్లకొలఁదిగ ద్రవ్యంబు ♦ గుంజుకొనుచు
వెలుఁగుచున్నావు దశదిశా ♦ వలయమందు 3

# రామాయణసారము

గ్రంథకర్త:—ద్రోణంరాజు సీతారామారావుగారు.

ఇది రామాయణము పూర్తిగా సులభశైలిని మిగుల రసవంతముగా వ్రాయబడినవచన కావ్యము. అద్భుతమగు పద్యములతో విరాజిల్లుచున్నది. స్కూలుపిల్లలకు పఠనీయముగా యుండును.

## మధుసేవ

కొత్తనాటకము పండితపామరులకు సంతోషమయ్యి నాటకరాజము. ఎన్నిమారులు చదివినా తనివితీరదు. వెల 1—0—0

## పాదుకాపట్టాభిషేకము,

సకలలోకాభిరాముఁడగు శ్రీరామచంద్రుని యొక్క చరిత్రయెన్నివిధముల నాదటు వ్రాసినను కర్ణానంద సముద్రమున నోలలాడించక యుండునా? ఇందు శ్రీరామచంద్రుఁడనుజసమేతముగా భార్యంగూడి వనవాటికి పంపబడుటకు గారకురాలైన మందరయొక్క పాత్రిబహుచక్కగా పోషింపబడి యెంతయు యుక్తియుక్తముగా నుండును. తండ్రియగు దశరథుని పరితాపము, అనుజుఁడగు భరతుని వ్యాకులము, ప్రేమయు, రఘురామునియొక్క ధైర్యమును దిలకింపక భాతృభక్తియు సీతామహాదేవి యెన్నికష్టములకయిన నోర్చి పతివెంట వనవాసము చేయుటవలన లోకమునకు ప్రకాశింపఁజేయు పాతివ్రత్యమహిమయు, లక్ష్మణునియొక్క సహోదరవాత్సల్యమును యెంతయు మనోహరములై యున్నవి. ఇందు కర్నాటక ఫార్సీ మట్లుగలవు. వెల 0—12—0

## ఆంధ్రనాటకములు.

బళ్ళారి ధర్మవరం కృష్ణమాచార్యులు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| చిత్రనళీయము | 1 | 6 |
| విషాదసారంగధర | 1 | 6 |
| పాదుకాపట్టాభిషేకము | 1 | 6 |
| ప్రమీలార్జునీయము | 1 | 4 |
| సావిత్రీచిత్రాశ్వము | 1 | 4 |
| రోషనారా శివాజి | 1 | 4 |
| చంద్రహాస | 1 | 4 |
| ప్రహ్లాదనాటకము | 1 | 4 |
| ముక్తావళి నాటకము | 1 | 4 |
| చిరకాలనాటకము | 1 | 4 |
| మోహినీరుక్మాంగద | 1 | 4 |
| బృహన్నలనాటకము | 1 | 4 |
| పాంచాలీస్వయంవరము | 1 | 4 |
| వరూధినీ నాటకము | 1 | 4 |

బళ్ళారి పండిత క. సుబ్రహ్మణ్యశాస్త్రులు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |

బళ్ళారి ధర్మవరం గోపాలాచార్యులు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| రామదాసు నాటకము | 1 | 4 |

బళ్ళారి కోలాచలం శ్రీనివాసరావు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| ఫాలాఫ్ విజయనగర్ | 1 | 6 |
| సుల్తానా చాందుబీ | 1 | 4 |

పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| పాదుకాపట్టాభిషేకము | 1 | 4 |
| కంఠాభరణము (హాస్యరసము) | 1 | 0 |
| రాధాకృష్ణ (భక్తిరసము) | 0 | 10 |
| విజయరాఘవము | 1 | 0 |
| వనవాసరాఘవము | 0 | 12 |

## ఆంధ్రనాటకములు

| | | |
|---|---|---|
| కళ్యాణరాఘవము | 0 | 8 |
| సారంగధర చరిత్రము | 0 | 8 |
| విప్రనారాయణచరిత్ర | 0 | 12 |
| వృద్ధవివాహము | 0 | 12 |
| ప్ర[illegible]మ (భయానకము) | 1 | 0 |
| వీరమతి (రౌద్ర నాటకము) | 1 | 4 |
| ముద్రిక (హాస్యరసము) | 0 | 12 |
| ప్రచండచాణక్యము | 1 | 4 |
| నర్మదాపురుకుత్సీయము | 0 | 12 |

చిలకమర్తి లక్ష్మీనరసింహం గారిచే (రచియింపబడినవి.)

| | | |
|---|---|---|
| గయోపాఖ్యానము | 0 | 8 |
| ప్రసన్నయాదవము | 0 | 8 |
| పారిజాతాపహరణము | 0 | 8 |
| చతురచంద్రహాస | 0 | 8 |
| పార్వతీపరిణయము | 0 | 6 |
| స్వప్నవాసవదత్త | 0 | 6 |

గురుజాడ అప్పారావు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| కన్యాశుల్కము | 1 | 0 |

కందుకూరి వీరేశలింగం పంతులు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| శకుంతల | 1 | 0 |
| సత్యహరిశ్చంద్ర | 0 | 12 |

వడ్డాది సుబ్బారాయుడు గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| అభిజ్ఞాన శకుంతల | 1 | 0 |
| విక్రమోర్వశీయము | 0 | 8 |
| వేణీసంహారము | 1 | 0 |
| చండకౌశిక హరిశ్చంద్ర | 0 | 12 |

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారిచే రచియింపబడినవి.

| | | |
|---|---|---|
| బొబ్బిలియుద్ధ నాటకము | 1 | 0 |
| గాంధీవిజయధ్వజము | 1 | [illegible] |

110



## ఆంధ్రనాటకములు.

| | | |
|---|---|---|
| సువర్ణపాత్రి రా॥ నా॥ | 0 | 12 |
| సంస్కారిణి దా॥ పు॥ | 1 | 0 |
| సావిత్రి మైలవరంవారు ప్రదర్శించేది శ్రీ॥ కొం॥ | 1 | 0 |
| తపతీసంవరణము కా॥ కొం॥ | 2 | 0 |
| రుక్మాంగద వే॥ భ॥ | 1 | 4 |
| రుక్మిణీపరిణయము గం॥ శ్రీ॥ | 1 | 0 |
| మాళవికా నాటకము ము॥ చం॥ | 1 | 12 |
| ముక్తావళి శో॥ భ॥ | 0 | 12 |
| భక్తతుకారాము త్యా॥ వెం॥ | 1 | 0 |
| మాలతీమధుకరము బ॥ స్వా॥ | 1 | 0 |
| శ్రీరామనిర్యాణము బో॥ శ్రీ॥ | 0 | 8 |
| బుద్ధనాటకము | 0 | 12 |
| అహల్య మ॥ అ॥ | 1 | 4 |
| తారాబాయి దే॥ తి॥ | 0 | 12 |
| మారుతివిజయము అను మైరావణవధ | 0 | 12 |
| వరవిక్రయము కా॥ స॥ | 1 | 0 |
| జేబున్నిసా పిం॥ నా॥ | 1 | 0 |
| ద్రోణప్రతిజ్ఞ బొ॥ నా॥ | 0 | 12 |
| సంగీతసావిత్రి గ॥ కా॥ | 0 | 12 |
| జయంతజయపాలము | 0 | 12 |
| తుకారామ్ శ్రీ॥ వీ॥ | 1 | 0 |
| వాసంతిక | 1 | 0 |
| వినోదిని (డిటెక్టివు నాటకం) | 1 | 0 |
| అలీప్రభువునిర్బంధము జ॥అ॥ | 0 | 10 |
| కృష్ణసంజయరాయబారము పె॥ వీ॥ | 0 | 12 |
| శంబుకవధ త్రి॥ రా॥ | 1 | 0 |
| మాతృదాస్యవిమోచనము గరుత్మంతునిచరిత్రి బు॥ ప॥ | 0 | 12 |
| మహానంద పం॥ శ్రీ॥ | 1 | 0 |
| రామదాసు కొ॥ ను॥ | 0 | 8 |
| రామరావణసంగ్రామము వ॥ య॥ | 1 | 0 |
| లలితచంద్రహాస అ॥ వీ॥ | 0 | 12 |
| కనకతార ము॥ పం॥ | 0 | 12 |
| ఆంధ్రనాటకకర్తలు పా1 అ॥ చం॥ | 0 | 10 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| పాపారాయనిర్యాణము శే॥ ర॥ | 1 | 0 |
| మదనసాయకనాటకం అ॥ అ॥ | 0 | 12 |

## నవలలు.

ఆంధ్రప్రచారిణీనిలయము
వెంకటపార్వతీశ్వరకవులు.

| | | |
|---|---|---|
| నూర్జహాను | 1 | 8 |
| వసుమతీవసంతము | 1 | 8 |
| రాజసింహ | 1 | 8 |
| పరమరహస్యము | 1 | 8 |
| ప్రమదావనము | 1 | 8 |
| మాతృమందిరము | 1 | 8 |
| శ్యామల | 1 | 8 |
| ప్రతిజ్ఞాపాలనము | 1 | 8 |
| నీలాంబరి | 1 | 8 |
| దృఢప్రతిజ్ఞ | 1 | 8 |
| మాయావి | 1 | 8 |
| నరేంద్రగుప్తుడు | 1 | 8 |
| వీరపూజ | 1 | 8 |
| మనోరమ | 1 | 8 |
| అపరాజిత | 1 | 8 |
| పూర్ణానందం | 1 | 8 |
| శివపురాణము | 1 | 8 |
| సీతారామ | 1 | 8 |
| గోరా పా1 | 1 | 8 |
| గోరా పా11 | 1 | 8 |
| భ్రాంతివిలాసము | 1 | 8 |
| మాయావిని | 0 | 12 |
| లక్షరూపాయలు | 0 | 12 |
| సీతావనవాసము | 1 | 0 |
| రజని | 1 | 8 |
| లలితకుమారి | 0 | 10 |
| శ్రీదేవి | 0 | 10 |
| పెద్దాపుర సంస్థానము | 0 | 10 |

## గొల్లపూడి వీరాస్వామి-శ్రీసీతారామా బుక్ డిపో, రాజమండ్రి

| నవలలు. | | |
|---|---|---|
| హమీర్ సింగ్ | 0 | 12 |
| ప్రసన్నముఖి | 1 | 0 |
| కర్ణసామ్రాజ్యము | 1 | 0 |
| అరవింద పా1 | 11 | 0 |
| డిటో రెండవభాగము | 11 | 0 |
| సాక్షి పా॥ ల॥పా1 | 2 | 0 |
| డిటో రెండవభాగము | 2 | 0 |
| డిటో మూడవభాగము | 1 | 12 |
| డిటో నాల్గవభాగము | 1 | 8 |
| హాస్యవల్లరి | 0 | 12 |
| గణపతి చి॥ ల॥ పా1 | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| అహల్యాబాయి | 0 | 12 |
| రాజస్థానకథావళి పా1 | 1 | 0 |
| డిటో రెండవభాగము | 1 | 0 |
| సునందని | 1 | 0 |
| హత్యాన్వేషణము | 1 | 0 |
| **వేగుజుక్క గ్రంథమాల నవలలు** | | |
| నేనే | 1 | 8 |
| కాలూరాయి | 1 | 8 |
| వాడేవీడు | 1 | 8 |
| ఠాసీహా | 1 | 0 |
| వీరాబాయి | 0 | 14 |
| భయంకరసతారాము | 1 | 0 |
| భీషణప్రతిహింస | 1 | 8 |
| ఘోరప్రతిక్రియ | 1 | 8 |
| భీకరరాక్షసి | 1 | ( |
| చతురిక | 1 | 0 |
| భయంకరనారీపిశాచి | 1 | 0 |
| ఎడ్డిపోలో | 1 | 0 |
| వనదుర్గము | 1 | 0 |
| ప్రచండభైరవము. | 0 | 12 |
| జయచంద్రవిజయము | 1 | 0 |
| ఆత్మసామ్రాజ్యము | 1 | 0 |
| చిత్రలేఖ | 0 | 12 |
| అగ్గిరాముడు | 0 | 12 |
| కన్నపుదొంగ | 0 | 12 |
| పగటిచుక్క పా1 | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| రుద్రమదేవి | 1 | 0 |
| చంద్రగుప్త | 0 | 8 |
| మనోహరిణి | 0 | 8 |
| శిరోమణి | 1 | 0 |
| భయంకరబడాచోర్ | 1 | 0 |
| పచ్చపుదొంగ | 1 | 0 |
| ఆనందరాయవిజయము | 0 | 4 |
| డిటో రెండవభాగము | 0 | 4 |
| సతీసక్కుబాయి | 0 | 6 |
| భోజరాజచరిత్ర | 1 | 0 |
| కాళిదాసచరిత్రము | 1 | 4 |
| తెనాలిరామకృష్ణచరిత్ర | 1 | 4 |
| సౌందర్యతిలక చి॥ ల॥ | 1 | 0 |
| కర్పూరమంజరి | 1 | 0 |
| సుధాశరచ్చంద్రి | 1 | 0 |
| రాజరత్నము | 0 | 12 |
| హేమలత | 0 | 12 |
| రామచంద్రవిజయము | 0 | 10 |
| నానకుచరిత్ర | 0 | 12 |
| గురుగోవిందుచరిత్ర | 0 | 12 |
| పరమహంసచరిత్ర | 1 | 0 |
| భారతకథామంజరి | 0 | 8 |
| రఘుకులచరిత్ర | 0 | 10 |
| సిద్ధార్థచరిత్రము | 0 | 12 |
| కృష్ణవేణి | 0 | 6 |
| మణిమంజరి | 0 | 8 |
| నందచరిత్ర | 0 | 4 |
| సువర్ణగుప్తుడు | 0 | 4 |
| అపవాదతరంగిణి | 0 | 8 |

గొల్లపూడి వీరాస్వామి-శ్రీసీతారామా బుక్ డిపో, రాజమండ్రి.

# వెండినగిషీఅంగడి

మావద్ద బెంగుళూరు, మద్రాసు, మైసూరు గ్రామాదుల కంపెనీలలో పేరుపొందిన పనివాళ్లను రప్పించి గ్యారంటీగా చాదీవెండితో తయారుఅయిన మరజోడాలు, నగిషీమరజోడాలు, కంచములు, గిన్నెలు, కమలంగిన్నెలు, సాదాగ్లాసులు, తామరాకులు, అడ్డాకులు. మర్రిఆకులు, సాదాపళ్ళెములు, రకరకాల నగిషీపళ్ళెములు, కాఫీకప్పు అండ్ సాసర, ఫ్రుడ్ బౌల్ బహుమతికప్పులు, మరిన్నికళావరు, డైమను, అరకు, ఇస్పేటు రకముల కుంకుమబరిణలు, స్త్రీల కుపయోగించు డయిమన్ కటింగు చయిన్సు, మిరియాలపట్టాలు, గట్టితోడాలు, అందెలు, కడియాలు, గుల్లకడియాలు, యింకా అనేక నమోనాగా తయారుచేయబడును. వెండిసామానులు యే నమోనా కావలసిన ఆనమోనాగా తయారుచేయించి వ్రాయిదా ప్రకారం యివ్వగలము. హాజరుగా కావలసిన విక్రియమునకు మావద్ద బొంబాయి చాదీవెండిగలవస్తువులు సరసమయినధరలకుదొరకును. ఇంకను మావద్ద నాణ్యమైన తివాసీలు, జంబుకాణాలు, పట్టుపంచెలు • విక్రియమునకు దొరకును. ఒకేపర్యాయము ఆర్డరుయిచ్చి చూడుడు. కావలసినవారు ఈక్రిందిచిరునామాకు వ్రాయుడు. మీఅడ్రసు సరిగా పెద్ద అక్షరములతో వ్రాయుడు.

వలయువారు— కాళేపల్లి వీరాజు అండు కంపెనీ.

గుండువారివీధి; రాజమండ్రి.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B144 |
| పుస్తకం పేరు | వరవిక్రయము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |